# పెనుగొండ ముట్టడి

కర్త

విద్వాన్ మాదిరాజు లక్ష్మీనారాయణశర్మ, బి ఎ, బి ఇడి, బి ఓ యల్,

హెడ్ మాష్టరు,

బోర్డు హైస్కూలు, కోడుమూరు, కర్నూలు జిల్లా



మోహన్ & కో.,

విద్యావిషయ ప్రచారకులు

1/549 హాస్పిటల్‌రోడ్, కర్నూలు

# ప్రకాశకుల విజ్ఞప్తి

దేశభాషలయందును, వాఙ్మయమునందున విద్యార్థులకుఁ దగిన ప్రవేశము కలుగుటకు మనోరంజకములగు ఉపవాచకములు ప్రధానము లను విషయము నందఱును ఎఱుఁగుదురు

ఉపవాచకములలో సామాన్యముగ మహాపురుషుల జీవితచరిత్రములును, కథలును కానవచ్చుచున్నవి విద్యార్థుల హృదయముల నాకర్షించుటకు కథారూపముగ నున్న ఉపవాచకములు ఎంతయు అనుగుణములు అట్టి కథలలోఁగూడ దేశచరిత్రమునకు సంబంధించినవానివలన ప్రయోజన మధికము ఇట్టివానివలన కథాంశముతోఁబాటు దేశచరిత్రముకూడ తెలియుచుండును అందును తెలుఁగు దేశమునకు సంబంధించిన కథలు విద్యార్థుల కెంతయు అనుకూలములు

ఈ పెనుగొండ ముట్టడి యను చిన్న నవల ఆంధ్రదేశచరిత్రమునకు సంబంధించినది సహనభావము విశ్వమానవసౌభ్రాత్రము, హిందూ-మహమ్మదీయ సఖ్యము మున్నగు విషయము లిందు సరళమగు భాషలో-చక్కని శైలిలో వివరింపఁబడినవి

ఉన్నత పాఠశాలలకు ఉపవాచకమును వెలువరించు నుద్దేశముతో ఈ పెనుగొండ ముట్టడి రచింపఁబడినది ఇట్టి నవలను రచించి మా కొసఁగిన గ్రంథకర్తగారికి కృతజ్ఞతావందనములు

విద్యాశాఖాధికారులును, ఉపాధ్యాయులును తగిన ప్రోత్సాహము నొసఁగి మా యుద్యమమును ఫలవంతముగ నొనర్పవలెనని ప్రార్థించుచున్నాము

ఇట్లు,

ప్రకాశకులు

# గమనిక

తాళికోటయుద్ధమున కృష్ణదేవరాయల యల్లుఁడు రామరాయలు మరణింపఁగా అతని తమ్ముఁడగు తిరుమలరాయలు విజయనగరమునందలి అమూల్యవస్తువులను, ధనమును పెనుగొండకుఁ జేర్చి, దానినే రాజధానినిగా నొనరించి మహమ్మదీయుల చెలిమికలిమిఁ గొంతకాలము రాజ్యము పాలించెను ఇయ్యది చరిత్రప్రసిద్ధము ఈ స్వల్పచరిత్రాంశము ఆధారముగా ఈ చిన్న నవల రచింపఁబడినది

ఆ పిదప మఱికొన్ని యేండ్లకు జరిగిన పెనుగొండపతనముతో ఏ కథకు సంబంధము లేదు

విద్యార్థులలో సహనభావము, సహకారము, శాంతగుణము పెంపొందుట కిట్టి రచన లుపయుక్తములు కాఁగల వను నమ్మికయే ఏతద్రచనకు ముఖ్యకారణము

భిన్న మతసంస్కారములు పొందిన వ్యక్తులు ఒకరినొకరు నిరాపించి అర్థము చేసికొనకుండుటవలని అనర్థములును, అర్థము చేసికొన్నవెంటనే సిద్ధించు సామరస్యసంపద, హిందూముస్లిము సఖ్యమును పెంపొందింపఁ జేయఁగల మానవమాత్రసేవాధర్మము, యుద్ధనివారణోపాయములు, ఈ చిన్ని కథలో పొందుపఱుపబడియుండుట చదువరులు గమనింప ప్రార్థితులు

ఏతద్రచనమున తోడ్పడిన మిత్రులు శ్రీ కలవటాల జయరామరావు గారికిని, దీనిని ప్రకటించిన మోహన్ అండు కంపెనీవారికిని అనేక ధన్యవాదములు,

ఇట్లు,

రచయిత

# పెనుగొండ ముట్టడి

## ౧

అవి తాళికోట యుద్ధము ముమ్మరముగా జరుగుచున్న దినములు !

విజయనగరసామ్రాజ్యమునకు తుదిగడియలు సమీపించినవి. రణరంగమున రెండు పక్షములకును పోరు ఘోరముగ సాగుచుండెను. అపజయము నిశ్చయమగుచున్న కొలఁదియు విజయనగరప్రభువగు రామరాయలకుఁ బట్టుదలయు నెక్కుడగుచుండెను. కంఠమున జీవమున్నంత వఱకును రణమును సాగించుటకే అతఁడు నిశ్చయించెను.

అట్టి సమయమున నొకనాఁటిరాత్రి యొక వీరుఁడశ్వారూఢుఁడై సేనాశిబిరము వైపునుండి విజయనగరమునకుఁ బ్రయాణము చేయుచుఁ దనలో నిట్లనుకొనుచుండెను.

'అయ్యో ! దైవమా ! తుదకు విజయనగరమహాసామ్రాజ్యమున కెట్టిగతి పట్టినది ? ఓడల బండ్లును, బండ్ల

నోడలును వచ్చునను లోకోక్తి నేటికి నిజమైనది! గుండ్లు తేలుటయు, బెండ్లు మునుఁగుటయు నిపుడు కనులారఁ గాంచుచున్నాము దక్షిణభారతదేశభాగముల నన్నిటిని తన యేలుబడిలోనికిఁ దెచ్చి, ఏకచ్ఛత్రాధిపత్యముగ వెలసిన విజయనగర మహాసామ్రాజ్యము నేఁడు నామ మాత్రావశిష్టము కావలసి వచ్చుచున్నదే! ఎంతలో ఎంత మార్పు కల్గినది ?

శ్రీకృష్ణదేవరాయ లుండునపు డూరును, పేరును లేక, ప్రక్కన పేలవలె నణఁగి మణఁగి యుండిన దుష్ట ప్రభుపు లిపు డెంతవారైరి? ఆంధ్రభోజుని కాలమున ప్రపంచవిఖ్యాతినొంది, మూఁడు శతాబ్దులనుండి సాటిలేని నగరమై విలసిల్లిన విజయనగరము నేఁటికి నశింప నున్నది కదా!

సామ్రాజ్యము సంగతి యట్లుండనీ వీరాధివీరుఁడై, శత్రువులకుఁ బ్రక్కలో బల్లెమయి యుండియు నీ సమయ మున నెట్టి ప్రయత్నములు చేయక శత్రువుల మాయో పాయములకు లొంగి చేతులార సామ్రాజ్యమును ధ్వంస మొనర్చె నను అపకీర్తి సోదరుఁడు రామరాయలకుఁ గలి గెనుకదా! తెల్లనివి పాలు, నల్లనివి నీళ్లనని యెంచుచు

శత్రువును బుత్రునిగా బుజ్జగించిన నిష్కపటికా యిట్టి కడగండ్లు కలుగుట ?

శ్రీకృష్ణదేవరాయలు మాయెడఁ జూపిన వాత్సల్యమును, ఆదరమును దలఁచుకొన్న నొడలు జల్లుమనుచున్నది సహజదయాళువగు నా ప్రభువు మాయెడ ననిర్వాచ్యమగు నభిమానము నుంచి యున్నతోద్యోగముల నొసంగెను. మా సోదరుల కిర్వురకును తన పుత్రికల నొసఁగి పరిణయమొనర్చి, మమ్ము దుర్గాధిపతుల నొనరించెను సర్వాధికారములను మా కొసఁగెను ఆ చక్రవర్తి గతించిన పిదప, విజయనగరకీర్తిని నిలుపలేక పోయితిమి సామ్రాజ్యమును శత్రుహస్తగత మొనర్చితిమి. ఇయ్యది యాతనియెడఁ జూపవలసిన కృతజ్ఞతకుఁ దార్కాణ మగునా ?

ఇఁక నెట్లును పరాజయము తప్పదు ప్రపంచవిఖ్యాతి నందిన విజయనగర మహానగరము బహామనీ సుల్తానుల చేతులలోఁ బడి నశింప నున్నది హరిహరరాయల కాలమునుండి యవిచ్ఛిన్నముగఁ గొనసాగుచున్న హిందూధర్మ, సంప్రదాయములకుఁ గడపటి దినములు సమీపించినవి. ఏది యెట్లయినను మఱల హిందూధర్మము

లను ప్రతిష్ఠించుటకును, జీర్ణసామ్రాజ్యమును పునరుద్ధ రించుటకును పూనుకొనవలసి యున్నది. '

అతఁ డిట్లాలోచించుచు, నశ్వమును హెచ్చ రింపకున్నను, అది యలవాటునుబట్టి శీఘ్రముగనే గమ్య స్థానమును సమీపించెను.

ఆ యశ్వారోహకుఁడు విజయనగర ప్రభువగు రామ రాయల తమ్ముఁడు తిరుమలరాయలు యుద్ధమున తమ కపజయము కలుగక తప్పదని నిశ్చయించి, శత్రువులు రాజ ధానిం గొల్లగొట్టకముందే యందలి యమూల్యవస్తువు లను, కోట్లకొలఁదిగ నున్న ధనమును రహస్యముగఁ బెను గొండకుఁ జేర్చి, దానినే సామ్రాజ్యమునకు రాజధాని నొనర్పవలెనని యాతని సంకల్పము. సమస్త సంపదల నొకచోఁ జేర్చి, తరలించుటకు సిద్ధముగా నుంచుట కిది వఱకే కొందఱు విశ్వాసపాత్రులగు నుద్యోగులు నియ మింపఁబడిరి. ఇపుడా సొత్తు నంతటిని స్వయముగఁ బెను గొండకుఁ జేర్పఁదలఁచి యాతఁడు రహస్యముగ రాజ ధానికి బయలుదేరెను. అతనికి కుడిభుజమును, విశ్వాస పాత్రుఁడును, ధైర్యశాలియు నగు ప్రతాపరాయలు

నీడవలె నాతని వెనుకనే వేఱొక యశ్వము నెక్కి వచ్చు చుండెను.

ప్రతాపరాయలు బాలవీరుఁడు, ఇరువదియేండ్ల యువకుఁడు. వయసునఁ జిన్నవాఁడైనను యుద్ధమున నాఱితేఱినవాఁడు; రాజ్యతంత్రజ్ఞుఁడు కావుననే అతఁడు రామరాయలయొక్కయు, తిరుమలరాయలయొక్కయు నమ్మకముఁ జూఱఁగొనెను. తిరుమలరాయ లే పని తలపెట్టినను ప్రతాపునితో నాలోచింపక చేయఁడు. అందుననే అమూల్య వస్తువులను, ధనమును విజయనగరమునుండి తరలించుట కాతనింగూడ తనవెంటఁ దీసికొని వచ్చు చుండెను.

వీ రిరువురును విజయనగరమును సమీపించుసరికే కొంద ఱాశ్వికులు వీరి కెదురుపడిరి. వారు విజయనగరము నుండి యమూల్యవస్తువులను పెనుగొండకుఁ దీసికొని పోవుటకు నియోగింపఁబడిన వ్యక్తులని తిరుమలరాయలు గ్రహించెను.

వారు తిరుమలరాయల నానవాలుపట్టి అతనికిని, ప్రతాపునకును నమస్కరించి నిలిచిరి.

అందు మొనగాఁడు 'ప్రభూ! తమ యాజ్ఞను నిర్వర్తించుటకై పెనుగొండకుఁ బోవుచున్నాము తురుష్కులు రాజధానిని ధ్వంసము చేయకముందే యందలి విలువగిల వస్తువులను, రత్నాభరణములను, బొక్కసము నందలి ధనమునంతను ఏఁబది గుఱ్ఱములపయి రహస్య మార్గమునఁ బంపుచున్నాను.

తిరు—సరియే! సంతసము మీ ప్రభుభక్తి కొని యాడఁదగినది నగరమున సదాశివరాయలకు క్షేమమే కదా!

నాయకుఁడు—క్షేమమే! కాని, యిఁకమీఁద నగరమున నుండినచోఁ క్షేమము లేదని, యాయనయు మన దుర్గమునకుఁ బ్రయాణమైనారు ఆయన సుఖముగఁ బెనుగొండ చేరుటకును తగిన యేర్పాట్లు చేయఁబడినవి!

తిరు—సరియే! మేలే యైనది, అన్నగారికి సదా శివరాయలపై గౌరవ మధికము, ప్రభువును ప్రాణము లొడ్డియైనఁ గాపాడుట మనకు ధర్మము ఈ కారణముననే అన్నగా రియనను యుద్ధరంగమునకు రానీయక రాజధానియందే నిలిపిరి! నేనును ప్రభువును పెనుగొండకుఁ

బంపుటకుఁ దగిన సన్నాహములఁ నొనర్పుటకే వచ్చు చున్నాను

నాయకుఁడు—చిత్తము. ఇఁక నెట్లును రాజధాని శత్రుహస్తగత మగునని తెలిసికొని ప్రభువులు ముందే జాగ్రతపడినారు! అంతఃపుర స్త్రీలును, రాజబంధువులును సురక్షితముగ పెనుగొండ చేరినట్లు నిన్ననే వేగరులవలనఁ దెలిసినది.

తిరు—ఈ కష్టసమయములో నిదియు సంతో షింపఁ దగినదే! ఇఁక ఆలసించినఁ బ్రయోజనము లేదు. మీరు వీలగునంత వేగముగ గమ్యస్థానముఁ జేరవలెను ప్రతాపుఁడును మీకు సాయముగా వచ్చును. నేను రణ రంగమునకేఁగి, యచటి పరిస్థితులఁ గనుగొని వీలగునంత త్వరితముగ మిమ్ముఁ గలిసికొందును

తిరుమలరాయ లిట్లు పల్కుచుఁ బ్రతాపునివైపు సాభిప్రాయముగఁ జూచెను. ప్రతాపుఁ డాతనికి నమస్క రించి యాశ్వికుల ననుసరించి పెనుగొండమార్గము పట్టెను



# ౨

ఆసమయమున దక్షిణభారతదేశము రాజకీయ వాతా
వరణముంబట్టి పెక్కుసమస్యలకు గుఱియై, అల్ల
కల్లోలముగ నుండెను.

కృష్ణదేవరాయలు కటకము మొదలుకొని కన్యా
కుమారివఱకును గల రాజ్యమునకుఁ జక్రవర్తియై యేకచ్ఛ
త్రాధిపత్యముగఁ బాలించునపుడు శత్రువులకుఁ గ్రేగంటఁ
గూడ చూడ నలవి కాకుండెను. ఆ చక్రవర్తి యస్తమింపఁ
గనే పరిస్థితులు మాఱిపోయెను. మహాసామ్రాజ్యము
కడగండ్లకు గుఱి యయ్యెను.

అంతే కాదు. కృష్ణదేవరాయలకును దన యవసాన
దశయందు మనశ్శాంతి లేకపోయెను. రాయలకు స్త్రీ
సంతాన మధికముగ నున్నట్లు ప్రతీతి యున్నది. ఆయన
మరణించునప్పటి కతనికిఁ బదునెనిమిది నెలల ప్రాయము
కల మగబిడ్డ యున్నట్లును తెలియుచున్నది. ఏమి కార
ణమో, యేమో! రాయలు తన యనంతరము తన సవతి
తమ్ముఁడగు అచ్యుతదేవరాయలే విద్యానగరసింహాసనము

నధిష్ఠింపవలెనని మరణశాసనమున వ్రాయించెను ఆ శాస నము ననుసరించి యచ్యుతరాయలే రాయలకుఁ బిదప ప్రభువయ్యెను. ఈతఁ డన్నివిధముల నసమర్థుఁ డగుటచే కృష్ణదేవరాయలు సంపాదించిన రాచూరు, ముదిగల్లు దుర్గములను పోఁగొట్టుకొనెను. ఇతఁడు తన బావమఱఁదు లగు సలకము తిమ్మయసోదరులకు సర్వాధికారముల నొసఁగెను. అచ్యుతరాయలు వారిచేతిలోని కీలుబొమ్మ యగుటచే పరిపాలన సవ్యముగ జరుగకుండెను విజయ నగర సామ్రాజ్యము క్షీణించుట కితని పరిపాలనమే దారి చూపెను

అచ్యుతరాయల మరణమునకుఁ బిదప రాజ్యమున కెవ్వ రర్హులను విషయమున వివాదములు చెలరేఁగెను సలకము తిమ్మరాజు మున్నగువా రచ్యుతరాయల పుత్రుఁ డగు వేంకటరాయలను ప్రభువుగా నొనర్పఁగోరిరి అచ్యుతరాయల సోదరుఁడగు రంగరాయలకు రాజ్య మిప్పించుటకు రామరాయాదులు ప్రయత్నించిరి. పెక్కు మంది సామంతులు తిమ్మరాజుపక్ష మవలంబించుటచే వేంకటరాయలే రా జయ్యెను రామరాయలు చేయునది లేక యూరకుండవలసి వచ్చెను.

సలకము తిమ్మరాజు మిగుల క్రూరుఁడు. రాజ్యాధి కారతృష్ణ యాతనికి మెండయ్యెను కాన రాజ్యమును తానే యాక్రమించుకొని వేంకటరాయలను జంపి, తానే ప్రభువునని చాటించెను సామంతు లెవ్వరు నతని కెదు రాడలేక పోయిరి.

కాని వా రెంత కాలము సహింపఁగలరు? సలకము తిమ్మయ దుష్పరిపాలనము సామంతులకును దుర్భర మయ్యెను కావున వారు రామరాయల నాశ్రయించిరి రామరాయాదు లాలోచించుకొని మాయోపాయములు పన్ని, తిమ్మరాజును నమ్మించి యతనిని జంపఁదలఁచిరి అతఁడు తుట్టతుద కీ సంగతిని గ్రహించి, వేఱు గతి లేక యాత్మహత్య చేసికొనవలసి వచ్చెను

పిదప రామరాయలు రంగరాయల పుత్రుఁడగు సదాశివరాయలకుఁ బట్టము కట్టి, ప్రజల యాదరమునకుఁ బాత్రుఁ డయ్యెను సదాశివరాయలు సర్వవిధముల నసమర్థుడు. అతఁడు నామమాత్రమునరాజు రామరాయ లే సర్వాధికారములను వహించి, యవిచ్ఛిన్నముగ రాజ్య పాలన మొనరించుచుండెను

రామరాయలు పరాక్రమశాలి యైనను దయాళువు. శత్రువు శరణుఁజొచ్చినయెడల—మాయమర్మములనెఱుఁగ

గల వారి కాశ్రయ మొసఁగును ఇట్టి యుదారగుణములే యతని పతనమునకుఁ గారణములైనవి! అతఁ డెవ్వరిని లక్ష్య పెట్టువాఁడు కాఁడు ఎవ్వరును త న్నెదిరింపఁజాల రనియును, ఒకవేళ ఎదిరించినను, తా నవలీలగ వారిని జయింపఁగలననియు నతఁడు గట్టినమ్మకముతో నుండెను.

తిమ్మరుసుమంత్రి విజయనగరరాజ్యమునకు ముఖ్య మంత్రి యైనప్పటినుండియు మహమ్మదీయుల దక్షిణదిగ్వి జయయాత్రాభిలాష ఫలవంతము కాలేకపోయెను కృష్ణరాయల కాలమున వారి దుర్గములు కొన్ని విజయ నగరరాజ్యమునఁ జేర్పఁబడెను రాయలు సర్వమతముల యెడలను సమాన మగు నాదరమును చూపుచున్నను, దక్షిణభారతమున మహమ్మదీయ మతము వ్యాప్తిఁ జెందుట కవకాశము లేకపోయెను. ఈ పరిస్థితులు మహ మ్మదీయప్రభువుల కెంతయుఁ గంటకము లయ్యెను సమయము చూచి, వా రొక్కపెట్టున విజయనగరముపైఁ బడి, దానిని నిర్మూల మొనరింపవలెనని నిశ్చయించిరి

అట్టివారిలో బహమనీ సుల్తానులును, గోల్కొండ నవాబును ముఖ్యులు కృష్ణదేవరాయల కాలమున హిందూమతము విజృంభించి మతాంతరముల నడఁచి

వేసెనని వీరితలంపు ఎట్లయినను హిందూసామ్రాజ్యమును హిందూధర్మమును ధ్వంసముచేసి, విజయనగరమునఁ దమ చంద్రపతాకను నిలుపవలెననియు, వీలగునంతవఱకును హిందూమతమును నశింపఁజేయవలెననియు కంకణము కట్టిరి రామరాయలతో మైత్రి పాటించి, నమ్మకము గలిగించి, యాతఁ డెట్టి ప్రయత్నములు లేక నిర్విచారముగ నున్నసమయమున దాడివెడల నిశ్చయించిరి వారి ప్రయత్నమే తాళికోట యుద్ధముగఁ బరిణమించెను

ఒకవైపుననుండి బిజాపురపు సుల్తాను ఆదిల్‌షాయును, వేఱొకవైపుననుండి గోల్కొండనవాబు ఇబ్రహీం కుతుబ్ షాయును లెక్కలేని సేనలతో తాళికోటవద్ద రామరాయల సేనల నెదుర్కొనిరి

రామరాయల కాదిల్‌షాయెడలఁ బుత్రవాత్సల్యము, రాయలదేవేరి యగు తిరుమలాంబయు భర్తవలెనే ఆదిల్‌షాను పుత్రునివలెఁ బ్రేమించెడిది. అట్టివాఁడు తనపైఁ గత్తికట్టుట చూచి రాయలు మిగుల నచ్చెరువందెను ఆదిల్‌షాతో యుద్ధము చేయ నతనికి మనస్సు రాలేదు, తాసా వయసు మీఱిన వృద్ధుఁడు! అయినను,

ఎవ రెంతచెప్పినను వినక, శత్రువులకుఁ దగిన శాస్తి చేయ వలెనను పట్టుదలతో రణరంగమున కురికెను ముందుగా ఎట్టిప్రయత్నములు చేసికొనని విజయనగరవీరులు శత్రువుల ధాటికిఁ దాళలేకపోయిరి రామరాయలు రణరంగము నందే యసువులఁ బాసెను

ఇట్లు విజయనగరము తలవని తలంపుగ శత్రుహస్త గత మయ్యెను

---

# 3

హతశేషులైన వీరులు రణరంగమును విడిచి పాఱి పోఁగా శత్రువులు వారిని వెన్నంటక విడిచిరి. విజయనగర రాజ్య పతనమే వారి లక్ష్యము. అది నెఱవేఱినది, కాన శత్రువులఁ దఱుముటకు యవనులు సంసిద్ధులు కాలేదు.

ఆ వీరులు ప్రాణరక్షణార్థము పెనుగొండకుఁ బోయిరి. తిరుమలరాయ లీ వఱకే యా దుర్గము నాశ్రయించెను. శత్రువు లా వంకకు రానందున వారు 'బ్రతుకుజీవుఁడా!' యని యనుకొనిరి.

ఇఁక తురుష్కవీరులు చేయవలసిన పని యొక్కటే! అది విజయనగరమును కొల్లగొట్టుట! దానికిని వారు సిద్ధపడిరి. నగరమును సమీపించి, వారు కొలఁది దూరములో గుడారములను నిర్మించుకొనిరి. ఒకవంక బహామనీ సుల్తాను గుడారములును, వేఱొకతట్టున గోల్కొండ నవాబు గుడారములును పన్నఁబడినవి.

నగరమును కొల్లగొట్టినపు డెవ్వరికి లభించిన వస్తువాహనములు వారివే యని నిర్ణయము చేయఁబడినది.

అయినను-ఒక పక్షమువా రెక్కువగా దోఁచుకొన్నచో రెండవ పక్షమువారి కసూయ జనించి సంఘర్షణమునకు దారి తీయును కావున ఏదో యొక సక్రమపద్ధతి యేర్పడిన పిదప గోల్కొండ, బిజాపుర ప్రభువులు తమ సైనికులను నగరముపైకిఁ బంపఁదలఁచిరి ఈ లోగా ప్రజలు నగరము నుండి యమూల్యవస్తువులను దీసికొని పోకుండ నగరము నాల్గువైపులను కొందఱు భటులను గాఁపుంచిరి అయ్యది యే యదనని యెంచి, యా భటులలోఁ గొందఱుఁ నగరముఁ బ్రవేశించి కొల్లగొట్టసాగిరి ఇట్లు బిజాపుర భటులకుఁ దెలియకుండ గోల్కొండ భటులును, వారికిఁ దెలియకుండ వీరును వస్తువులను సంగ్రహింపసాగిరి నేర్పరులగు పురజనులు కొందఱు వీరి కనులు గప్పి విలువ గల వస్తువులతోఁ బలాయితు లగుచుండిరి స్థలాంతరము లకుఁ బోవుట కెట్టి యవకాశము లేని జనులు కొందఱు పిడికిటఁ బ్రాణములఁ బెట్టుకొని నగరమునందే కాలము గడపుచుండిరి విజయనగరము, తత్పరిసరప్రదేశములు సంక్షోభమున కాలవాలము లయ్యెను

విజేతలగు మహమ్మదీయప్రభువులు ప్రపంచ ప్రఖ్యాతిఁ గన్న విజయనగరమును స్వాధీనపఱచుకొని, పాలించి యుండవచ్చును కాని యది వారి యుద్దేశము

కాదు ఆ మహానగరము హిందూమతమునకుఁ బట్టు గొమ్మ భారతీయ సంస్కృతికి మూలకందము. ఆర్య ధర్మముల కాశ్రయము నగరమునందలి ప్రతిశిల్పము, ప్రతిదేవాలయము, ప్రతిభవనము నీ యంశమునే చాటు చుండును కావున మతాంతరులకు దానిని ధ్వంసమొన ర్చినఁగాని తృప్తి కలుగదు. అచటి సంపదను కొల్లగొట్టి తమ రాజధానులకుఁ దీసికొని పోవుటయే వారి పరమలక్ష్యము

యవనవీరుల కివి శుభదినములు! వా రిప్పుడు విజయగర్వమునఁబటకుటీరములలో వినోదముగఁ గాలము గడపుచున్నారు సురాపానప్రమత్తులయి వారు పాడు పాటలకును, ఆఁడు నాఁటలకు నవధియే లేకుండెను. కుటీర ద్వారములందుఁ గునుకుచుఁ గూర్చుండిన రక్షకభటులు తప్ప తక్కిన యందఱును కైపెక్కి, స్వర్లోకసుఖము ననుభవించుచున్న ట్లుండిరి.

అట్టి వినోదదినములలో నొకనాఁటి సాయంకాల మున నొక యాశ్వికుఁడు తన గుఱ్ఱమును వేగముగాఁ బరు గెత్తించుకొనుచు గోల్కొండసుల్తాను శిబిరసన్ని వేశమును

సమీపించెను. అతనిం గాంచిన సేవకులు కొందఱు వంగి వంగి సలాములు చేయఁదొడఁగిరి.

ఆ యాశ్వికుఁడు దూరప్రదేశమునుండి హుటాహుటిగ వచ్చుటచే మిగుల శ్రమపడి యున్నట్లు కాన వచ్చుచుండెను. అతఁడు తిన్నగా నవాబుగుడారమునకుఁ బోయి, ద్వారపాలుని మూలమునఁ దన రాకను ప్రభువునకుఁ దెలియఁబఱచెను. కొలఁదిసేపటిలోనే యనుమతియు వచ్చెను.

పిదప నాశ్వికుఁడు లోనఁ బ్రవేశించి, సవినయముగ నవాబునకు సలాముచేసి, యొక చీటి నాతని కందించి నిలిచెను. ప్రభువు దానిం జదివినకొలది ముఖము వెలవెల పోసాగెను దిగులు హెచ్చెను. విచారమున నాతఁడా చీటిని మడఁచుచు నిస్తబ్ధుఁడై యుండిపోయెను. అందేమున్నదో, అచటి యాంతరంగికులకుఁగూడ నూహింప శక్యము కాకుండెను.



౪

'సౌదామినీ! సౌదామినీ! ఏమమ్మా! ఎప్పుడును ఏదో ఆలోచించుచున్నట్లే యుందువు. పెద్దలకు లేని ఆలోచనలు, విచారము నీకెందులకమ్మా!'

అని పెనుగొండలోని రాజాంతఃపురమునకుఁ బ్రక్కనున్న యుద్యానవనమున నొక దిగుడుబావిమెట్లపైఁ గూరుచుండి తామరపూవురేకులను ద్రెంపి పడవేయుచు, ఆలోచనలో మునిఁగి యున్న యొక పదునాఱేండ్ల బాలికను చెలికత్తె మందలించుచుండెను

సౌదామిని అందకత్తె, ఆమెముఖమునఁ బ్రసన్నభావము తాండవించుచుండును. ఆమె తన పనిని మానక యే విచారముగ నవ్వుచు 'చంపా! నీ వెప్పుడు నిట్లే యనుచుందువు. నే నాలోచించియు, విచారించియుఁ జేయునదేమి ? ఈ సంగతినిమాత్రము చెప్పుము. విజయనగరము ధ్వంసమైనట్లేనా? శత్రువు లింకను మనలను వెన్నంటి వచ్చుచున్నారా?' అని ప్రశ్నించెను.

చంపావతి—ఈపాటికి విజయనగరపు స్థితి మన మూహించినట్లే యయి యుండునని తోఁచుచున్నది.

శత్రువులు పెనుగొండవైపునకు వచ్చు జాడ కానరాదు. కారణమేమో తెలియదు. కాని వారీ వైపు రారనుట స్పష్టమట! విజయనగరవినాశమే వారు కోరినది! దానితో వారు తృప్తిజెంది యుండవచ్చును

సౌదా— మన బంధువులలో నెవ్వరైన నచట చిక్కుపడి యుండిపోలేదు కదా!

చంపా—అందఱును సురక్షితముగ నిచట చేరిరి. శత్రువులబాధ యుండదని తెలిసిన వెంటనే కొందఱు గండికోటకును, కొందఱు చంద్రగిరికిని - వారివారి బంధువులకడ కంపఁబడుదురఁట! బాబయ్యగారి కొప్పడగు నొక యువకుఁడు మాత్రము ఇంకను తిరిగి రాలేదని అమ్మగా రాందోళనపడుచున్నారు. అతఁడు ముఖ్యము లగు పత్రము లేవో తెచ్చుటకు మూఁడు దినములక్రిందటనే పంపఁబడెనఁట!

చంపావతి యిట్లు పల్కుచు సౌదామినివైపు చూచి యామెభావమును కనిపెట్టసాగెను.

సౌదా—ఎవరే ఆ యువకుఁడు?

చంపా — (చిఱునవ్వు నవ్వుచు) వే తెవ్వరను కొరు రాయల సన్నిహితుఁడగు విజయరాయల పుత్రుఁడగు ప్రతాపరాయలు!

సౌదా—ఓహో! అతఁడు మన తిరుమలమ్మగారి కుమారుఁడు కదా!

చంపా—ఓసి కృతఘ్నురాలా! ఎంతలో మఱపు నకు వచ్చినదే! మొన్న మన మీా గుట్టక్రింది దుర్గము నకుఁ బోవునపుడు పొదలోఁ బొంచి యుండి మనపైఁ బడనున్న చిఱుతపులిని ఒక్క బాణమునఁ జంపి, మనలం గాపాడినది ఆ ప్రతాపుఁడే కదఁటే!

సౌదా—(కొంచెము సిగ్గుతోఁ దల వంచి) అతఁడే యితఁడని నాకుఁ దెలియదమ్మా!

చంపా— (నవ్వుచు) తెలియనిచో ఇప్పుడైనను తెలిసికొనుము తిరుమలమ్మకు నీయెడ ఎంత ప్రేమ కలదో తలఁచుకొనుము. నీయెడఁ గల యభిమానము చేతనే ఆతఁడు మొన్న మనలను కాపాడినాఁడు దాని కేదో హేతువుండునని నే ననుకొనుచున్నాను.

సౌదామిని కించుక కోపము కలిగెను ఆమెముఖ మెఱ్ఱపడెను 'పోవే! నీ మాటలు వింతగా నున్నవి నీవేమో మనసులో దురాలోచన పెట్టుకొని పలుకు చున్నావు ఇంక నాతో మాటలాడకుము' అని యామె ముఖము చిట్లించుకొనెను.

చంపా—అంత కోప మెందుకే? మన మిచ్చటికి వచ్చినప్పటినుండియు అతఁడు నిన్ననుసరించియే తిరుగు చుండుటను నేను గమనించితిని అంతఃపుర రక్షణభార మాతనిపై నుంచుటయు దీని కనుకూలమే యైనది నేనున్న మాట చెప్పితిని. దీనికి నీవు కోపించుట యేలనో తెలి యదు! పోనీ! ఆ ప్రసంగమును మానెదను లెమ్మా. నీవును ఎట్టి ఆలోచనము పెట్టుకొనక సంతోషముగ నుండుము.

చంపావతి యిట్లు పల్కుచు నామెను లేవనెత్తి పూవులఁ గోసికొంద మనుచు వెఁటఁగొని వంకకుఁ దీసికొని పోయెను.

సౌదామిని రాజకుటుంబమునకుఁ జెందిన తిమ్మ రాయలను నొక దుర్గాధ్యక్షుని కుమార్తె ఆమె పసితనము ననే తండ్రి గతించెను అతఁడు రామరాయలకు మిక్కిలి

హితుఁడు కావున ఆతని మరణమునకుఁ బిదప రామ రాయలు సౌదామినిని, ఆమె తల్లిని రాజధానికిఁ బిలిపించి, మిగుల గౌరవముతోఁ గాపాడుచుండెను తిరుమల రాయల దేవి యగు వెంగళాంబ కీ సౌదామినియెడఁ బుత్రికావాత్సల్యము కలదు కావున అంతఃపురములో నీమెను ప్రేమింపనివా రొక్కరును లేరు. ప్రతాపరాయల తల్లి తిరుమలమ్మ యీ బాలిక నెంతో గారాబమునఁ జూచుచుండును

సౌదామినీ, చంపావతు లచటఁ దిరుగుచు నొక మందారవృక్షమును సమీపించిరి ఆ చెట్టు బాగుగ పుష్పించినది , కాని పూవులు చేతి కందుబాటులో లేకుండెను అయ్యది తోఁటప్రాకారపుగోడ దగ్గఱగనుండు టచే సౌదామిని మూఁడడుగుల యెత్తుగల యా గోడపై కెక్కి కొమ్మలు వంచి పూవులఁ గోయ నెంచెను.

ఆమె యొక చిన్న కొమ్మ వంచి రెండు, మూఁడు పూవులఁ గోసెను వేఱొక పూవు కోయుటకై కొమ్మను వంచుటకు ముందునకు వంగుచు, ఆ యూఁపున క్రిందఁ బడిపోయెను వెంటనే చంపావతి యామెను లేవనెత్తెను ; సౌధామినికి పెద్ద దెబ్బ తగులలేదు , కాని గోడప్రక్క

నున్న యొక ముండ్లకంచెపై పడుటచే వాఁడిముండ్లు పాదములకు గాఢముగ గ్రుచ్చుకొని నొప్పి కలిగెను. ఆమె యడుగుతీసి యడుగు పెట్టలేకపోయెను. పాదముల నుండి రక్తము స్రవింపసాగెను ఆమె కన్నులనుండి బాష్ప ములు రాలుచుండెను చంపావతియుఁ గన్నుల నీరు నించెను. ఏమి చేయుటకును దోఁచక ఆమె యిటునటు చూడసాగెను. సమీపమున నెవ్వరి యలికిడియు లేదు.

కొంత దూరమునుండి దీనిని గమనించుచున్న యొక యువకుఁడచటికి వేగముగా వచ్చి సంగతిని గ్రహించి సమీపమునఁ గల పొదలోనికిఁ బోయి, ఏవో యాఁకులు తెచ్చి, సౌదామిని కాలిలో విరిగిన ముండ్లు మెల్లగఁ దీసి, ఆ యాఁకులను గాయములపయినుంచి తన యుత్తరీయ మును చించి కట్టుకట్టెను. సౌదామిని లజ్జచేఁ దల వంచు కొని, చేయునది లేక యూరకుండెను తా నతని చికిత్స నంగీకరింపనిచో చంపావతి యూరకుండదనియు, త న్నింకను అపహాస్యము చేయుననియు నామె భయము!

చికిత్స పూర్తి యైనది. ఆ యువకుఁడు పోవుటకు సిద్ధపడెను. అప్పుడు చంపావతి 'అయ్యా! మీ మహోప కారమునకుఁ గృతజ్ఞులము ఇదివఱ కొకసారి మా ప్రాణ

ములనే కాపాడితిరి. మీ యీ ఋణము తీర్చుకొనలేము ' అని సవినయముగఁ బల్కెను

యువ—మానవుఁడైనవాఁడు తనకు వీలగునప్పుడితరులకు సాయపడుట ధర్మము అదియే లేనిచో మానవత్వమే నశించును. ఇం దొకరికొకరు కృతజ్ఞతఁ జూపవలసిన పనిలేదు.

చంపా—ఇట్లు పల్కుట ఉదారులకు సహజము. తమ రింకను విజయనగరమునుండి రాలేదని బాబయ్య గారును, అమ్మగారును చాల తహతహ పడుచున్నారు మాకును ఆందోళన కల్గుచుండినది మీరచటనుండి వచ్చుటయు, మా చెలికి వెంటనే చికిత్స చేయుటయు మిక్కిలి యచ్చెరువు గల్గించుచున్నది !

చంపావతిప్రసంగమునుబట్టి యా యువకుఁడు ప్రతాపరాయలని చదువరులు గ్రహించియే యుందురు.

ప్రతా—ఈ యుదయముననే తిరిగి వచ్చితిని. కొంచెము సేపు విశ్రాంతి తీసికొని యిచట రక్షణకై ఏర్పా ట్లేవిధమున జరిగినదియు చూచుటకు వచ్చితిని.

సమయమునకు వచ్చితినిగాన, నాకుఁ దెలిసిన యాఁకును-రక్తస్రావము నడ్డుటకు కట్టితిని, కాని నేను చేసిన చికిత్స యేమియును లేదు, నాకు వైద్యము తెలియదు.

అనుచు నతఁడు మందహాస మొనర్చుచు నటనుండి పోయెను.

చంపా—చెలీ ! ప్రతాపుని చికిత్సవలనఁ గొంత నొప్పి తగ్గిన దనుకొందును

సౌదామిని యేమియు పల్కలేదు

చంపా—నీ కాలినొప్పి తగ్గినను తగ్గవచ్చును, కాని యతఁడు తన వైద్యమువలన నీ మనస్సున కేదో బాధ కలిగించిపోయెనని నే ననుకొనుచున్నాను. నా యూహానిజమే గదా ?

సౌదా—(కోపముతోఁ జూచుచు) చాలు లేవే నీ మాటలు ! ఇఁక నిట్లు పల్కినచో అమ్మగారికి తెల్పెదను జాగ్రత్త !

చంపా—(నవ్వుచు) ప్రతాపుఁడు నిన్ను వెంబడించి తిరుగుచున్నాఁడని యిప్పుడు స్పష్టమైనది కదా! అతని నుండి తప్పించుకొనుటకు జాగ్రతపడవలసినదానవు నీవు! నే నెందులకు జాగ్రతపడవలెను?

సౌదామిని మాఱుపల్కక యచటినుండి వెడలి పోయెను. చంపావతియు నామెను వెంబడించెను.



# ౫

భారతఖండము నంతటి నొక్క ప్రభువు పరిపాలించుట యెప్పుడు జరిగెనో తెలియదు. కాని యీ దేశమును ప్రధానముగ ఆర్యావర్తము, దక్షిణాపథము నని రెండు భాగములుగ విభజింపవచ్చుననుట స్పష్టము.

కృష్ణదేవరాయల కాలమున దక్షిణదేశములోని పెద్ద భాగము విజయనగరపరిపాలనక్రింద నుండెను. విజయనగర ప్రభువులే కాక ఒకవంక బహామనీసుల్తానులు, వేఱొక వంక గోల్కొండ నవాబులు, ఇంకొకవంక మహా రాష్ట్రులును తమతమ రాజ్యముల నభివృద్ధిపఱచుకొను టకు బహుముఖములఁ బ్రయత్నింపసాగిరి.

ఉత్తరమున సాత్పురాపర్వతములు మొదలుకొని తూర్పున గంగాసరస్వతులనుండి పశ్చిమతీరమువఱకును వ్యాపించి యున్న దేశమును మహారాష్ట్రు లాక్రమించి యుండిరి. వారు సాటిలేని హిందూ ధర్మపరాయణులు , హైందర మతోద్ధారకులు. హిందూరాజ్యవ్యాప్తికిని, మతాభివృద్ధికిని తమ సర్వస్వమును, జీవితమును గూడ సమర్పించుటలో అగ్రేసరులుగాఁ బేరెన్నిక గన్నవారు మహారాష్ట్రులే!! వీరు శౌర్యధనులు , విశ్వాసపాత్రులు ,

స్వామిభక్తిపరాయణులు, కావుననే విదేశీయులును, హైందవేతరులు నగు మహమ్మదీయులు కూడ మహారాష్ట్రులనే తమ మంత్రులఁగా నెన్నుకొనుచుండిరి వీరి మంత్రాంగమున రాజ్యపాలనము చక్కఁగా జరుగుచుండినది

ఇట్లు పరరాజులకడ నుద్యోగములు చేయుచు, స్వధర్మములను నిర్వర్తించుచుండిన మహారాష్ట్ర వీరులకు ప్రత్యేకముగ మహారాష్ట్ర సామ్రాజ్యమును స్థాపింపవలెనను నభిలాష మనస్సులందే యడఁగి యున్నది వీరు తాము సేవించు ప్రభువుల రాజ్యములను విస్తరింపఁజేయుటకు యుద్ధములలోఁ బాల్గొని, తమ ప్రాణములనైనను లెక్కగొనక రణరంగమునఁ బగతురఁ జెండాడి విజయము చేకూర్చుచుండిరి యుద్ధమునఁ దమ కీడగువారింకొకరు లేరనెడి ప్రఖ్యాతిని పడయుచుండిరి.

మన కథాకాలమునాఁటికి మహారాష్ట్రులు హిందూ రాజ్యములందే కాక బహమనీ సుల్తానులయొద్దను, గోల్కొండ నవాబులయొద్దను గూడ ఉన్నతపదవులు సంపాదించి యుండిరి,

బహమనీసుల్తానులకు బ్రాహ్మణులయెడను, హిందువులయెడను గొంతవఱకు భక్తివిశ్వాసములు కలవు దానికిఁ గారణము లేకపోలేదు ఈ సుల్తానుల వంశమునకు మూలపురుషుఁడగు 'జఫర్ ఖాను' ఢిల్లీయందలి 'కాంగో' అను నొక బ్రాహ్మణుని బానిస తన బానిసయగు 'జఫర్ ఖాను' మునుముందు గొప్పస్థితికి రాఁగలఁడని గ్రహించి, యతనికి కాంగో స్వాతంత్ర్యము నొసఁగి దీవించి పంపెను ఆ జఫర్ ఖానే తుదకు బహమనీరాజ్యమును స్థాపించెను అతఁడు తాను పరానువంశీయుఁడైనను, తన్ను గాపాడుచు వచ్చిన 'కాంగో' బ్రాహ్మణునిపైఁ గల గౌరవమును స్థిరముగా నిలుపఁదలఁచి, తన రాజ్యమునకుఁ 'బ్రాహ్మణరాజ్య' మని పేరిడెననియు, ఆనామమే క్రమముగ మాఱుచు 'బహమనీ' రాజ్యముగ మాఱెననియు కొందఱు చెప్పుదురు

అంతియే కాదు అది మొదలుకొని బహమనీ సుల్తానులు హిందువులను బాధించుట మానిరఁట! మహారాష్ట్రుల ద్వితీయ రణకౌశలము కలవారగుటచే వారికిఁ దమ రాజ్యమునం దున్నతోద్యోగముల నొసఁగి గౌరవించెడివారఁట!

మన కథాకాలమునాఁటికి గోల్కొండను ఇబ్రహీం కుతుబ్ షా పాలించుచుండెను ఈతని యొద్ద జగదేవరావు, రాయరావు, మురారిరావు నను ముప్పురు మహారాష్ట్రులు ఉన్నతపదవు లలంకరించి యుండిరి. సర్వాధికారములను నవాబు వీరి కైవశము చేసి, తాను నామమాత్రముగా ప్రభువై యుండెను. ఇట్లుండినచో వీరి సాయమునఁ దాను హిందూరాజ్యములను సులభముగా జయింపవచ్చునని తలంచియుండెను.

పయి మహారాష్ట్ర వీరత్రయము నిరాఘాటము సాగుచుండు తమ యధికారమును వ్యర్థపుచ్చలేదు వీలగు నంతవఱకును వా రుద్యోగములను మహారాష్ట్రులకే యొసంగుచుండిరి దీనికి వారి యాంతరంగికసంకల్పము వేఱు. బహమనీ సుల్తానులును, గోల్కొండ నవాబును హిందూరాజ్యములను కబళింప నెదురుచూచుచుండుట వీరికిఁ దెలియును తమ్ము సాధనములఁ జేసికొని, యా పనిని నెఱవేర్ప నవాబు సంకల్పించెనని వీ రూహింపక పోలేదు. హిందువులతో యుద్ధమే తటస్థించినచో సమయము చూచి, వారిప్రక్కఁజేరి హిందువులకే విజయముఁ జేకూర్పవలెనని వీరు నిశ్చయించిరి.

నవాబు క్రమముగ నీ యంశమును పసిపట్టెను. తాను బహామనీ సుల్తానులతో జరుపు సంప్రదింపులకు నిరోధము కల్గించుచు, తాళికోటసమరమునకు సైనికులలో నిరుత్సాహమును ప్రబలఁజేయుచున్న రాయరావు నాతఁడు చంపించెను జగదేవరావు ఈ చర్యను సహింపక ప్రభువున కెదురు తిరిగెను మహారాష్ట్రవీరు లందఱు నతని పక్షముఁ జేరిరి వారిసాయమున జగదేవరావు గోల్కొండ రాజ్యములోని కొన్ని దుర్గములను స్వాధీనము చేసికొని స్వతంత్రుఁడయ్యెను. ఇయ్యది కుతుబ్ షా కాశ్చర్యముఁ గలిగించెను. నవాబునకు 'హిందువులను నమ్మరా' దను నభిప్రాయము కలిగెను ఇఁక మిగిలియున్నవాఁడు మురారిరావు అతనిం గూడ పదవీచ్యుతు నొనర్చినచో తన రాజ్యములోని బహుసంఖ్యాకు లగు హిందువులకుఁ దీఱని యసంతృప్తి కలుగుననియు, విప్లవములు చెలరేఁగుననియు భావించి నవాబు మురారిరావును ముఖ్యమంత్రిగా నొనర్చి యతని కృత్యములను గమనింపసాగెను. మురారిరావును ప్రభుభక్తిని ప్రకటించుచుఁ దన విధ్యుక్తధర్మములను సక్రమముగ నెఱవేర్చుచు ప్రభుని విశ్వాసమును గడించెను కాని కుతుబ్ షా విజయనగరరాజ్యముపైకి వెడలిన వెంటనే మురారిరావు తనయాప్తులను కూడఁగట్టుకొని విప్లవమును సాగింప నెంచెను

గోల్కొండప్రభువు తాళికోటయుద్ధమునకు వెళ్లిన వెంటనే మురారిరావు తన యనుచరులమూలమున విప్లవ మును వ్యాపింపఁజేసెను. నవాబు యుద్ధమును ముగించి, విజయనగరమువైపు వెళ్లుసరికి విప్లవము దేశము నలు మూలల వ్యాపించెను. ఆ విప్లవము నణఁగఁ ద్రొక్కుట నవాబుకుమారుఁడగు మహమ్మద్ కులీకుతుబ్ షా కసాధ్యమయ్యెను. కావుననే యాతఁడు వెంటనే యీ వృత్తాంతము నంతటిని వివరించుచు నొక జాబు వ్రాసి యొక గూఢచారుని మూలమున తండ్రికిఁ బంపెను దానిం గాంచి ఇబ్రహీం కుతుబ్ షా ఎట్లు నిశ్చేష్టత నొందినదియు మనము మూఁడవ ప్రకరణము చివరిభాగమునుబట్టియే తెలిసికొనవచ్చును

పిదప గోల్కొండప్రభువు సేనలతోఁగూడ నింటి ముఖము పట్టెను బహుమనీ సుల్తానుకూడ విజయనగర మును కొల్లఁగొట్టుటతో తృప్తినొంది బిజాపురమునకుఁ దరలెను.



## ౬

గోల్కొండలో బయలు వెడలిన రాజకీయవిప్లవము కారణముగ నవాబు రాజధానికి వెడలి పోవుటయు, సుల్తాను బిజాపురమున కేఁగుటయు పెనుగొండకుఁ జారుల మూలమున వెంటనే తెలియవచ్చెను. ఇఁక నింత వేగముగ శత్రువుల భయము లేదని తిరుమలరాయలకును, అతని సామంతులకును కొంత యూరట కలిగెను. మఱల సేనలను సమకూర్చుకొని విజయనగరమును స్వాధీనపఱచుకొని తిరిగి విశాల సామ్రాజ్యమును స్థాపింపవలెనని తిరుమలరాయలకు అభిలాష కలిగెను. అందులకై యాతఁడొక నాఁటి రాత్రి ముఖ్యులతో రహస్యాలోచనమందిరమున సమావేశము జరిపెను. అందు ప్రభువగు సదాశివరాయలు, తిరుమలరాయలు, తిరుమలరాయల పుత్రుఁడగు శ్రీరంగరాయలు, మైసూరు కృష్ణప్పనాయకుఁడు, గండికోట తిమ్మానాయకుఁడు, గుత్తి దుర్గాధిపతి యగు ఆదెప్ప నాయఁడు, సిద్ధవటము తిమ్మప్ప, ప్రతాపరాయలును పాల్గొనిరి.

తొలుత తిరుమలరాయలు యుద్ధమున తమ కపజయము కలుగుటకును, రామరాయల మృతికిని కారణ

ములను వివరించి ఇఁకముందైనను తగినట్లు జాగ్రత వహిం
చినయెడల శత్రువుల నెదుర్కొనుట సుసాధ్యమనియు,
అందులకై సర్వవిధముల యత్నించుట ధర్మమనియు
హెచ్చరించెను.

పిదప సదాశివరాయ లిట్లు పలికెను—

'బావగారు పలికిన దెంతయు నుచితముగనే
యున్నది కాని తాళికోటయుద్ధమున మనకు విపరీతపు
నష్టము కలిగినది. తురుష్కప్రభువులు విజయగర్వమున
న్యాయాన్యాయములను విచారింపక రాజధానిని కొల్ల
గొట్టి సర్వసంపదలను దోఁచుకొనిరి మనము నిర్భయ
ముగా వారియువులఁ బీల్చుట కిప్పు డిప్పుడే వీలు కలుగు
చున్నది మన సామంతులు కూడ నిప్పటిలో యుద్ధయత్న
ములకు సుముఖులుగా నున్నట్లు తోఁచదు. కావున తగిన
సమయమున కెదురుచూచుచుఁ గొంతకాల ముపేక్షించు
టయే శ్రేయమని నాకుఁ దోఁచుచున్నది.'

తిమ్మా—ప్రభువులు సెలవిచ్చినదే యుచితమని
నాకును దోఁచుచున్నది. ఇప్పుడు క్రొత్తసైన్యమును
సంపాదించుకొనుట సాధ్యముకాని పని యుద్ధనిహతు

లగు వీరుల బంధువులు దుఃఖములో మునిఁగియున్న యీ సమయమున సైన్యములోఁ జేరుట కెవ్వరు నిచ్ఛగింపరు మఱియొక యంశమును మనము గమనింపవలసి యున్నది దినదినాభివృద్ధి పొందుచున్న కృష్ణరాయల సామ్రాజ్యము తమ రాజ్యములను కబళించి, తమ మతమును, సంస్కృతిని నశింప జేయు నను భయముననే మహమ్మదీయప్రభువులు మనపై దాడి వెడలిరనియు, వారికి మనపై వ్యక్తిగతముగ విరోధము లేదనియుఁ దెలియుచున్నది ద్వేషమే యున్న యెడల వారింకను మనలను వెంబడించియే యుందురు ఇట్టియెడ మనము యుద్ధప్రయత్నములఁ జేయుట కొఱవితోఁ దల గోకికొన్నట్లే యగును విజయ నగరదుర్గమును పునర్నిర్మించుకొనుట మన కసాధ్యము ఒకవేళ సాధ్యమేయైనను, దానికిఁ గొన్ని యేండ్లు పట్టును కావున మనము యుద్ధప్రయత్నములు మాని సర్వవిధముల స్వరక్షణమునకే యత్నించుట మేలు

శ్రీరంగ—మామయ్యగారును, తిమ్మానాయకుఁడును బాగుగా ఆలోచింపకయే తమ యభిప్రాయముల నిచ్చినట్లు తోఁచుచున్నది మనలో నిట్టి సంకుచితాభిప్రాయములును, పిఱికితనము నుండుటంబట్టియే మన కిట్టి దుర్గతికిఁ బాలు కావలసి వచ్చినవి యుద్ధమున శత్రుపక్ష

మునకును నష్టము అపారముగఁ గలిగినది. లేనిచో ముష్కరులగు వైరులు మనలను విడుచునంతటి దయాళురు కారు బహమనీ సుల్తానులలో ఐకమత్యము చెడినది. మన దుర్గములను స్వాధీనము చేసికొనకుండ తిరిగి వచ్చినందులకు మిగిలినవా రాదిల్‌షాను నిందించుచున్నట్లు తెలిసినది. ఈ కారణమున పరస్పర స్పర్థలు పెరిగినవి. గోల్కొండలో మురారిరావు విప్లవమును లేవఁదీసెనుగదా! గోల్కొండ ప్రభువు రోగములో మునిఁగి యున్నాఁడు. ఇఁక కొలఁది దినములలోనే ఈ లోకమును వీడఁగలఁడని నా మనస్సునకుఁ దట్టుచున్నది. ఈ సమయమున మనము సేనలను సమకూర్చుకొని విరోధుల నెదిరించినచో విజయము తప్పక కలుగఁగలదని నాకుఁ దోఁచుచున్నది.

శ్రీరంగరాయలు తిరుమలరాయల ద్వితీయపుత్రుఁడు, తండ్రి యనంతరము రాజ్యాధికారమును పొందవలసినవాఁడు.

శ్రీరంగరాయల ధోరణి సదాశివరాయలకుఁ గొంత నొప్పి కలిగించెను. అతఁ డిట్లనెను

సదా—పౌరుషము కొఱవడి, పిఱికిపందల మగుటచే నిట్లు పలుకుచున్నామని శ్రీరంగరాయలు భావింప

నక్కఱ లేదు ఆ విధముగా భావించినయెడల రణరంగ మున వీర విహార మొనర్చి, వీరస్వర్గము నలంకరించిన రామరాయలు తక్క మిగిలిన యందఱు నా లెక్కలోనికే వత్తురు. పౌరుష మున్నవార మే యగుచో శత్రువులకు భయపడి పెనుగొండకుఁ బరుగిడి వచ్చుటేల? విజయనగర మును విడువ నేల? ఇట్లు ప్రగల్భములు పలికిన మనము-రేఁపుదయము శత్రువులు పైఁబడినచో ఎక్కడ నుందుమో యెవ్వరి కెఱుక?

శ్రీరం—మావి ప్రగల్భములో, పసయున్న మాటలో సమయము వచ్చినపుడు తెలియును అనుమాన మున్నచో రాయలవారు ఎదురుగా నిలిచి పరీక్షింప వచ్చును.

తిరుమలరాయలు కుమారుని మందలించెను. తన యభిప్రాయమును దెలుపవలెను గాని పెద్దలను నిందించు ధోరణి ఎంతమాత్ర మభిలషణీయము కాదనియు, ఈ విషయము నందఱును గుర్తింపవలెననియు నతఁడు పల్కెను.

పిదపఁ బ్రతాపరాయలు లేచి యిట్లనెను—

'చారవిభాగమునకు నే నధ్యక్షుఁడ నగుటచే వారి మూలమునఁ దెలిసిన యంశములను గొన్నిటిని మనవి చేయుచున్నాను.

గోల్కొండలో విప్లవము విజృంభించినందున నవాబు విజయనగరపుఁ గొల్లలో పాల్గొనకుండ రాజ ధానికిఁ దరలిపోయెను. పుష్కలముగ ధనమును కొల్లఁ గొట్టు నుద్దేశముతోనే ఆతఁడు సుల్తానుకు సాయముగ మనపైకి వచ్చెను కాని యా పని నెఱవేఱలేదు. మీఁదు మిక్కిలి నష్ట మపారముగాఁ గలిగెను సుల్తాను విపరీతపు రొక్కమును దోఁచుకొన్నను ఒక్క కాసైనను నవాబునకు ముట్టఁజెప్పలేదు 'ఎవ్వరికి లభించినవి వారివే' అని ఇది వఱలో సామాన్యపుటొడంబడిక యున్నందున దాని ననుసరించియే తాను ప్రవర్తించుచున్నట్లు సుల్తాను గోల కొండకు వర్తమాన మంపెను ఇది నవాబునకు సహింప రాని దయ్యెను అతని శరీరస్థితియు, మానసికస్థితియు సరిగాలేవు. అతనికి బిజాపురముపై ద్వేషముకలిగినది క్రమ క్రమముగ నది వృద్ధిచెందు సూచనలును కానవచ్చు చున్నవి కాఁగా మనకు గోల్కొండవలన నింతలో ఎట్టి భయమును లేదు. కాని బిజాపురసుల్తానును నమ్మలేము

పుత్రవాత్సల్యముఁ జూపుచున్న రామరాయలపైకి వెడలి వచ్చిన కృతఘ్నుఁ డెంతకైనఁ దగును మన మెల్లపుడును యుద్ధమునకు సంసిద్ధులమై యుండుటయే మేలని నాకుఁ దోఁచుచున్నది.'

పిదపఁ దక్కుంగల దుర్గాధిపతులును తాము సర్వవిధముల ప్రభుత్వముతో సహకరించునట్లును, సమయము వచ్చినచోఁ దమ తమ సైన్యములతో నచ్చునట్లును, తగిన సేనలం గూర్చుకొనునట్లును ప్రతిన లొనర్చిరి.

తుదకు తిరుమలరాయ లిట్లనెను—

'పరస్పర విద్వేషమువల్ల వ్యక్తులకే కాక, తన్మూలమున దేశమునకును తీరని కష్టములు కలుగును. జాతిమత వైషమ్యములు లేక మనము పరస్పర స్నేహమునకు పాటు పడవలెను యుద్ధము లావశ్యకములు కాకున్నను, స్వరక్షణమునకైనను సేనలం గూర్చుకొనుట ముఖ్యము. బిజాపుర సుల్తానుతోఁ గాని, గోల్కొండ నవాబుతోఁ గాని విరోధించవలెనని నియమము లేదు మైత్రి నెఱపుటకే సర్వవిధముల యత్నములు చేయఁబడును. అది యసాధ్యమైనచో యుద్ధము తటస్థింపవచ్చును. అట్టియెడ

వెనుకంజ వేయరాదని నా మనవి. గౌరవహానికరమగు పిఱికి కంటె కీ రాజ్యమున స్థాన ముండకూడ దని నా యాశయము '.

ఆ మాటల కందఱు నంగీకరించిరి. దీనితో నాఁటి సభ ముగిసెను. అందఱును దమతమ నెలవుల కరిగిరి.

'ఏమయినను ఇట్టివాని రాజ్యాధిపత్యము మాత్రము సహింపరానిది ' అని శ్రీరంగరాయలు సదాశివరాయలం గూర్చి మనస్సులో ననుకొనెను.



## ౭

నరపతివంశ సంజాతుఁడగు తిరుమలరాయలు తమ వంశము ప్రతిష్ఠను నిలుపుచు నష్టపూర్వమగు విజయనగర సామ్రాజ్యమును పునరుద్ధరించుటకు సర్వవిధముల యత్నించుచుండెను. ఆటవికజాతులగు ఏనాది, చెంచు, ఎఱుకుల, బోయ జాతుల నుండియు, ముత్తరాచ, రెడ్డి జాతులనుండియు ధైర్యసాహసములు గల వీరుల నేర్చి, తన సైన్యమునఁ జేర్చుకొని సైనిక శిక్షణము నిచ్చుచుండెను. పూర్వమునుండియు నమలులో నున్న యొడంబడిక ప్రకారము గోవా రేవున కధిపతులుగా నున్న పోర్చుగీసు వర్తకులు పర్షియా, అరేబియా దేశముల నుండి గుఱ్ఱములను తెప్పించి రాయలకే విక్రయించుటచే అశ్వసైన్యము నభివృద్ధి చెందుచుండెను. మైసూరునుండి గజములు వచ్చుచుండెను. గండికోట, పెనుగొండ, గుత్తి మున్నగు దుర్గములు బలిష్ఠములుగా నొనర్పఁబడుచుండెను. హఠాత్తుగా శత్రువులు పైఁబడినను ఎదిరింప సిద్ధముగా నున్నట్లు తిరుమలరాయలు తృప్తిచెందియుండెను.

ఈ విధముగా మనస్సు కొంత కుదుటఁబడినందున రాయలు కృష్ణదేవరాయలవలెఁ గళాపరిపోషకుఁడనెడి ఖ్యాతిని సంపాదింపఁదలంచెను శిల్పనిర్మాణము, విద్యాగోష్ఠులు, మతసామరస్య ప్రదర్శనములు మున్నగు మహత్తర విషయములను అతఁడు లక్ష్యములనుగా గ్రహించెను శిల్పకళయందు ఆరితేరినవారిని రప్పించి వారిచే ఆలయములను, హర్మ్యములను నిర్మింపఁజేసెను రామరాజభూషణ బిరుదాంకితుఁడగు మూర్తికవిని సమ్మానించి, తన యాస్థానకవిగా నియమించి 'వసుచరిత్ర' మను మహా ప్రబంధమును కృతి నొందెను హిందూమహమ్మదీయులు కలిసి పాల్గొనుటకును వీలుగ కొన్ని సంఘముల నేర్పాటు చేసెను తన రాజధాని యగు పెనుగొండలో జరుగు 'బాబయ్య ఉర్సు' అను ముసల్మాను పండుగు అత్యంత వైభవముతో జరుగు నేర్పాట్లు చేయించెను దూర ప్రదేశములనుండి వచ్చు మహమ్మదీయ యాత్రికులకు తగిన వసతులు కల్పించెను.

'బాబయ్య ఉర్సు' హిందూమహమ్మదీయుల సమ్మేళనమును సూచించు పదము. ఈ యుత్సవము నట్టిదే! ఈ యుత్సవ మేర్పడిన విధముంగూర్చి యిచ్చటఁ బ్రస్తావించుట యప్రస్తుతము కాదు.

పూర్వము బాబయ్య యను నొక హైందవుఁడు కాలవశమున ఫకీరుగ మాఱిపోయెను అతఁ డొకపుడు యాత్రలు చేయుచు 'మక్కా'కుఁ బోయెను అచటి గొప్ప ఫకీ రొకఁడు బాబయ్య కొక చెట్టురెమ్మ నొసఁగుచు 'బాబయ్యా! ఈ రెమ్మను దీసికొని పోయి నీవు మకాము చేయు స్థలమున రాత్రి నాటుచుండుము. ఉదయమగుసరికి ఇది చిన్న మొక్కగా మాఱి మొగ్గతొడిగి పుష్పించిన స్థలమునే నీ శాశ్వత నివాసముగాఁ జేసికొమ్ము దివ్య స్థలమునసే గాని యీ రెమ్మ చిగిర్చి, మొగ్గతొడిగి పుష్పింపదు' అని చెప్పెనఁట! బాబయ్యయును మక్కా నుండి మఱలివచ్చునపుడు తాను బస చేసిన మజిలీ లన్నింటి యందును ఆ రెమ్మను నాటి పరీక్షించుచుండెను కాని యెచటను ఫకీరు చెప్పిన విధమున జరుగలేదు చివఱ కతఁడు పెనుగొండకువచ్చి, యొక దేవాలయమువద్ద బసచేసి, ఆ రాత్రి యా రెమ్మను నాఁటఁగా ఉదయమగుసరి కది పెరిగి పెద్దదయి మొగ్గలతోను, పూలతోను నిండియుండెను బాబయ్య పరమానందభరితుఁడై తాను రాత్రి బసచేసిన దేవాలయమునే తనకు స్థిరనివాసముగ నేర్పఱచుకొనెను అతని శిష్యులు నతనిసంకల్పమును బలపఱచిరి. కాని హిందువులు తమ దేవాలయము నాతనికి నివాసముగా

నీయ సమ్మతింపలేదు కాని బాబయ్య తా నాస్థలము నుండి ఎంతమాత్రము కదలనని పట్టుపట్టెనఁట !

పిదప నచ్చటి ప్రజలు బాబయ్య దురాగతమును అప్పటి విజయనగరప్రభువగు హరిహరరాయల కెఱిఁగించి రఁట! ఆ ప్రభువు బాబయ్యమహిమను దెలిసికొని యుం డెను 'ఫకీరు నిజమైన ప్రభావము కలవాఁడైన నచ్చో నచ్చోటు నుండ నర్హుఁడు, కాదేని అతనిం జంపింతు' నని తెలియఁ జేసెను పిదప నా ప్రభువు తన రాజ్యములో గొప్ప యోగియని పేరుపొంది హిందువులచేఁ బూజింపఁ బడు జంగము సన్న్యాసిని రప్పించి, ఫకీరుబాబయ్యను, ఆ సన్న్యాసిజంగమయ్యను వేర్వేఱుగా సున్నముచే నింపఁబడిన గోనెలలో వేయించి మూతులు బిగించి, ఆ గోనెలను చెఱియొక తటాకమునను బడవేయించెనఁట! బాబయ్య యథాపూర్వముగ తన స్థానమునం దా మఱు నాఁడు శిష్యులతో ముచ్చటలాడుచుండెనఁట ! జంగము సన్న్యాసి మాత్రము మరణించెను రాయలు బాబయ్య మహిమకుఁ దృప్తిఁజెంది ఆ యాలయమును బాబయ్య స్వాధీనము చేసెనఁట ! నాఁటినుండియు నేఁటివఱకు నచట నీ 'బాబయ్య ఉర్సు' జరుగుచునే యున్నది బాబయ్యను

పడవైచిన చెఱువును 'బాబయ్యచెఱు' వనియు, జంగమును బడవేసిన చెఱువును 'జంగమయ్యచెఱు' వనియు ఇప్పటికిని బ్రజలు వ్యవహరించుచున్నారు!

ఉత్సవ మతి వైభవముగ జరుగుచుండెను గోల్కొండ, బిజాపురము మున్నగు స్థలములనుండి కూడ పెక్కుమంది మహమ్మదీయులు సకుటుంబముగ నీ యుత్సవములఁ జూడ వచ్చిరి పెక్కుమంది హిందువులును మహమ్మదీయులతోఁ బాటు వినోదములలోఁ బాల్గొనుచుండిరి.

ఉద్రిక్తులగు హిందువులు కొంద ఱీ యుత్సవములకుఁ గల కారణములను దలఁచుకొనసాగిరి పవిత్రమగు హిందూదేవాలయము మసీదుగ మాఱిపోవుట వారి మనస్సు నుడుకెత్తించెను. ప్రస్తుతస్థితిలో ప్రభువులు కొంత సైన్యముఁ గూర్చుకొని యున్నందున కొందఱు తాము ప్రబలులమనియు, తా మేమి చేసినను భయములే దనియు భావించి మహమ్మదీయుల కలఁజడిని గల్గించి, తృప్తిఁ బొందఁదలఁచిరి

జనసమ్మర్ద మెక్కువగా నున్న యొకచోట చిన్న జగడము ప్రారంభమయ్యెను. దానికిఁ గారణ మేమో

ఎవ్వరికిని దెలియదు. ఒకరిపై నొకరు తాళ్లు రువ్వుకొను చుండిరి ఆ యుత్సవమునకు వచ్చిన మహమ్మదీయుల యోగక్షేమముల నరయుటకును, స్వయముగ 'ఉర్సు' నడిపించుటకును ప్రభువగు సదాశివరాయ లా సమయము ననే యచటకు వచ్చుట తటస్థించెను ఈ యల్లరి కాతఁడే కారణమని తురుష్కులు కొంద ఱాతఁ డున్న వైపునకుఁ బరుగిడిరి ఈ సంక్షోభము నాపుటకు రమారమి నాలుగు గడియల కాలము పట్టెను క్షతగ్రాతులు వైద్యశాలలకు చికిత్సలకై పంపఁబడిరి తిరుమలరాయలు, శ్రీరంగరాయలు, ప్రతాపరాయలు మున్నగువారు వచ్చి తగు కట్టుదిట్టముల నొనర్చిరి ఒక మహమ్మదీయ బాలికకుఁ గాఢముగ తలపై దెబ్బలుతగులుటచే ఆమె స్మృతి తప్పి పడిపోయెను స్వల్పచికిత్సలవలనఁ బ్రయోజనము లేక పోయెను కావున ఆమె పరిచారికల సాయమున మహారాణి అంతఃపురము నకే పంపఁబడెను. రూపమునుబట్టియు, వేషమునుబట్టియు నామె యొక పెద్ద కుటుంబమునకుఁ జెంది యుండునట్లు తోఁచినది !

ఇంతకంటెను జరిగిన ఘోరమేమనఁగా - సదాశివ రాయలు హత్యచేయఁబడెనని యొక మూలనుండి కోలా హలము బయలువెడలెను. అతని నెవ్వరు హత్య చేసి

నదియు ఎవ్వరికిని దెలియదు. కాని బాబయ్యమసీదునకు వెనుకఁ గల ఒక ఇలుకుసందులో నతని మృతకళేబరము కానవచ్చెను. ముసల్మానెవ్వరో అతనిని సంహరించి యుండునని కొందఱును, అతని యంగరక్షకులలో నొకఁడీ క్రూరకర్మ నాచరించెనని కొందఱును, ఈ విషయము ముందుగనే తిరుమలరాయల పుత్రుఁడు శ్రీరంగరాయలకుఁ దెలిసి యుండవచ్చునని కొందఱును తమకుఁ దోఁచినట్లు చెప్పికొనుచుండిరి. ఈ ఘోరమును జూచి తిరుమల రాయలు మున్నగువారు నిలువున నీరైరి.

సంతోషముతో ప్రారంభమైన నాఁటి దినము విషాదాంతముగ నయ్యెను. రాజభవనము రోదనధ్వనులతో నిండిపోయెను.

ఫతిమా కన్నులు తెఱచి చూచుసరికిఁ దా నొక సుందర మందిరమున మెత్తని శయ్యపైఁ బరుండి యున్న ట్లామె గ్రహించెను. ఆ భవనము నామె యీావఱ కెన్నఁడును చూచి యెఱుఁగదు. ఆమె ఎంతసేపటినుండియో వెల్లకిలఁ బరుండి యుండుటచేఁ గొంచె మొత్తిగిలి పరుండవలెనని తలఁచి కొంచెము కదలి తల త్రిప్ప నుంకించెను. కాని ఎవ్వరో మృదుహస్తమున తన తలను పట్టుకొని కదలనీయ లేదు. చేతిగాజుల గలగలధ్వనింబట్టి తన తలను కదల నీయక పట్టుకొన్నది ఒక యువతియే యని ఫతిమా నిర్ణ యించెను. ఆమెకుఁ దలపై పెద్ద గాయమగుటచే చాల నొప్పిగా నుండెను. ఆ గాయమునకుఁ దగిన చికిత్స చేసి కట్టు కట్టిన ట్లామె గ్రహించెను.

ఆమె కొక్కొక్క విషయమే జ్ఞప్తికి వచ్చుచుం డెను. 'బాబయ్య ఉర్సు' లో జరిగిన యల్లరిలోఁ దన తలకు సూది ఱాళ్లు తగిలి పెద్ద గాయము లేర్పడి స్మృతి తప్పుటవఱకు ఆమెకు జ్ఞప్తి యున్నది. తర్వాత నేమి జరిగినదియు, తన ముదుసలి తండ్రిగతి ఏమైనదియు

నా మెను దెలియదు తన్నెవ్వరో యుదారులు రక్షించి చికిత్స చేయుచున్నట్లును, మిగుల మర్యాదతోఁ బరికించు చున్నట్లును దెలిసికొని తన సంరక్షకులకు మనముననే కృతజ్ఞతను వెల్లడించెను.

ఫతిమా మఱలఁ గదలుటకు యత్నించెను

'అమ్మా! మీరు కొంచెమైనను కదలరాదు; కదలినచో గాయము రేగి రక్తము స్రవించుననియు, అట్లయినచో గాయము కుదురుట దుర్ఘటమనియు వైద్యులు చెప్పిరి' అనెడు నొక కోకిలస్వర మామెచెవిని బడెను

ఆమె శరీరమునకుఁ జల్లని పిల్లవాయువులు తగులుచు బాధను కొంచె ముపశమింపఁ జేయుచుండెను వేఱొక యువతి వీవనతోఁ దనకు విసరుచున్నదని యామె క్రేగంటి ప్రసారమునఁ దెలిసికొనెను.

'నే నెక్కడ నున్నాను?' అని ఫతిమాకంఠము నుండి మెల్లని ధ్వని వెలువడెను.

'సురక్షిత స్థలముననే యున్నారు'

'మీ రెవ్వరు?'

'మీ యాప్తకోటిలోనివారమే! మీ రేమియును సందేహింపనక్కఱలేదు.'

'నే నిచటి కెప్పుడు తేఁబడితిని ?'

'రెండు దినములక్రిందట. అమ్మా! మీ రెక్కువగా మాటలాడరాదు. కన్నులు మూసికొని పరుండుఁడు. మీ కేమి కావలసినను సైఁగ చేయుఁడు. ఇది వైద్యుల యాదేశము !'

'ఇదిమాత్రము తెల్పుఁడు. మాతండ్రికి క్షేమమే కదా!'

'ఆయన క్షేమముగనే యున్నారు '

'క్షమింపుఁడు. ఇట్లు నన్ను రక్షించుచున్న మీ పేరడుగవచ్చునా?'

'సౌదామిని'

ఫతిమా కన్నులు మూసికొనెను. ఆమె నేత్రముల నుండి రెండు మూఁడు బాష్పబిందువులు రాలెను.

'బాబయ్య ఉర్సు' లో గాఢముగ గాయపడిన మహమ్మదీయబాలికయే ఫతిమా యనియు, ఆమె జారాంతఃపురమునకుఁ దీసికొని రాఁబడెననియు, అచటనే చికిత్సపొందుచున్నదనియు, సౌదామిని యామెబాధ్య

తను వహించుచున్నదనియు పారకులు గ్రహించియే యుందురు

ఫతిమా పదునెనిమిదేండ్ల బాలిక, గోల్కొండ నవాబువద్ద ఉన్నతోద్యోగిగా నుండిన అబ్దుల్లాయను సంపన్నగృహస్థుని యేకైకపుత్రిక ఆమెతల్లి చిన్నతనముననే మరణించెను వయసు మీఱినపిదపఁ గలిగిన బిడ్డ యగుటచేతను, వేఱు సంతానము లేనందునను తండ్రి కీమెపై మక్కువ యెక్కువ వృద్ధుఁడగు అబ్దుల్లా ఉద్యోగమునుండి విరమించినపిదప సత్కాలక్షేప మొనర్చుచు, మతగ్రంథములను పఠించుచు, తీర్థయాత్రల కేఁగుచు దినములు వెళ్లఁబుచ్చుచుండెను ధనము పుష్కలముగ నుండుటచే నాతని కెట్టి కొఱఁతయు లేకుండెను కావున నతఁడు సుఖజీవనము చేయుచుండెను 'బాబయ్య ఉర్సు' అనిన అతని కెక్కువయిష్టము ఆ యుత్సవములం గాంచి యానందించుటకే అతఁడు పుత్రికతోఁ గూడ వచ్చెను. ఉత్సవమున జరిగినకొట్లాటలో అబ్దుల్లాకును కొంచెము దెబ్బలు తగిలెను. కాని యవి యంత ప్రమాదకరమైనవి కావు. ఫతిమాకు మాత్రము తలకు తీవ్రముగా దెబ్బలు తగులుటచే ఆమె స్మృతితప్పి పడిపోఁగా, తిరుమలరాయలు మున్నగువారు వచ్చి యల్లరుల నడఁచి క్షతగాత్రులను

వైద్యశాలల కంపుటయు, ఈమెమాత్రము ప్రమాదావస్థలో నుండుటవలన అంతిపురములోని సౌదామిని కప్పగింపఁబడుటయు జరిగినది.

నాలుగైదు దినముల చికిత్సవలన ఫతిమా ప్రమాదావస్థనుండి తప్పుకొనినది కాని పూర్తిగ ఆరోగ్యము కలిగి, తిరుగులాడుట కింకను నెల దినములు పట్టునని వైద్యులు తెలియఁజేసిరి.

సౌదామినియు, నామె చెలికత్తె యగు చంపావతియుఁ దనకుఁ జేయుచున్న పరిచర్య ఫతిమా హృదయము నెంతయు నాకర్షించెను. ఆమె వారిని తన సోదరీమణులకంటె నెక్కువగ ప్రేమించెను వారు కానరాకున్న ఆమె మనస్సులో మిగుల బాధపడుచుండెను

ప్రమాదావస్థ తప్పినదని తెలిసినపిదప ఒకనాఁడామె మంచముపైఁ గూరుచుండి యుండఁగా, అంతఃపురమున నొకమూలనుండి రోదనధ్వనులు వినవచ్చెను. ఫతిమా దిగులుపడి కారణమేమని సౌదామినిని ప్రశ్నించెను.

సౌదామిని కన్నీటితో 'అమ్మా! ప్రభువుగారైదు దినములక్రిందట మరణించిరి' అనెను.

ఫతిమా—'బాబయ్య ఉర్సు'నకు మేము వచ్చిన నాఁడు ప్రభువుగారును అచటికి వచ్చిరని విని యున్నానే! ఇంతలోనే మృత్యువా? ఏమి మాయ!

సౌదా—నీకు సంగతి యేమియుఁ దెలియనట్లున్నది నీకు దెబ్బ తగిలినపుడే ఆయన నెవ్వరో హత్య చేసినారు

ఫతిమా—(ఆశ్చర్యపడుచు) హత్యయా? హత్య యా? ఎంత ఘోరము? నే నేమో పొరపడితిని! నా పొరపాటున కిపుడు పశ్చాత్తాపము కల్గుచున్నది

సౌదా—హిందువులు యాత్రికులగు మహమ్మ దీయులను హింసించిరని నీవు తలఁచినట్లున్నావు మహమ్మ దీయులు ప్రభువునే హత్య చేసిరని ఇపుడు తెలిసికొంటివి కదా! ఈ మత వైషమ్యము లెట్టి ఘోరములను కల్పించు చున్నవి?

ఫతిమా—ముస్లిములు మహారాజును హత్య చేసిన సమయమున ఒక ముస్లిము బాలికను కన్న కుమార్తె కంటె నెక్కువ గౌరవముతోఁ గాపాడి చికిత్స చేయించు వారు, చేయువారును మానవమాత్రులు కారనియు, దేవతా మూర్తులనియుఁ దలంపవచ్చునా?

సౌదా—కష్టములో నున్న యొక ప్రాణికి సాయము చేయుట మానవధర్మము. మేము నీకు చేయు సేవయు నంతమాత్రమే! నీవు మహిళ వగుటచే ఇక్కడికి తీసికొని రావలసి వచ్చినది దీనికి నీ వింతగాఁ బ్రశంసింపఁ బనిలేదు.

ఫతి—ఇట్లు పల్కుట ఉత్తముల స్వభావమేమో! అది యటుండనీ సోదరీ! మతము పేరు చెప్పి పోట్లాడు కొనుటయు, పేరాస కారణముగా యుద్ధము లొనర్చి ప్రజానాశనము నొనర్చుటయు ఎంత సిగ్గుల చేటు! ఈ విషయమై ప్రతిభావంతు లేల ఆలోచింపరో?

సౌదా—స్వార్థమనునది మనస్సును పీడించు చున్నంతవఱకును ఇట్టివాని కంతము లేదు దేశసేవా పరాయణులగు యువకులును, యువతులు నీ విషయమై ప్రయత్నించిన కొంత ఫలముండవచ్చునేమో!

ఫతి—అవును. నాకు నట్లే తోఁచుచున్నది. ఈ విషయమున నేను శక్తివంచన లేక పాటుపడుటకు సంసిద్ధముగ నున్నాను.

అప్పుడు చంపావతి తొందరగా నచటికి వచ్చి సౌదామినితో 'ప్రతాపుఁడు నీకొక చీటినిపంపినాఁడమ్మా!' అని నవ్వుచుఁ జెప్పెను.

'నీ కెప్పుడును హాస్యము చేయుటే పని' అని సౌదామిని చీదరించుకొనెను.

చంపా—నీ కెప్పుడు నతనిమీఁదనే ధ్యానము! అందుచేతనే నేను హాస్యము చేయుచున్నానని భ్రాంతిపడుచున్నావు. ఇందు వేఱేదేని విషయ ముండును. దీనిని త్వరగా అందించవలెనని యొక భటుఁడు తెచ్చినాఁడు.

ఆ జాబును విప్పి చంపావతి చదివి సౌదామిని కొసఁగెను.

అందలి విషయ మిట్లున్నది. 'అబ్దుల్లా పూర్తిగ కోలుకొని తన పుత్రికను చూడఁగోరుచున్నాఁడు. ఎప్పుడెచ్చట చూడ వీలగునో, తెలుపఁ గోరిక.'

'నేఁటి సాయంకాలము పూలతోఁటలోఁ జూడ వచ్చునని చీటి వ్రాసి పంపు' మని సౌదామిని పల్కెను.

'నీ కాలిలో ముండ్లు గ్రుచ్చుకొన్న చోటికేనా?' అని నవ్వుచు చంపావతి పోయెను.



మురారిరావు తన్ను మోసగించి విప్లవమును లేవఁదీసిన యుదంతము వినినప్పటికే గోల్కొండనవాబుమనస్సు చెడిపోయెను. దానికి వార్ధక్యము తోడు కాఁగా అచిరకాలముననే ఆతఁడు మరణించెను. తండ్రిమరణానంతరము మహమ్మద్ కులీ కుతుబ్ షా గోల్కొండ సింహాసన మధిష్ఠించి, తన రాజధానిని భాగానగరమునకు మార్చెను. భాగానగరము గోలకొండ కైదు క్రోశముల దూరమున మూసీనదీతీరమునఁ గల సుందరనగరము. నూతనప్రభువు తన రాణియగు 'భాగా' యెడఁ గల ప్రేమాతిశయమున ఆమెపేరితో నీ నగరమును నిర్మించెను.

నూతనప్రభువు తండ్రితప్పిదమును గ్రహించి, మహమ్మదీయరాజ్యపతనమునకు హిందువులే కారణభూతులని తలంచి, తనకు మీర్ జుమ్లా యను నతనిని ముఖ్యమంత్రిగా నియమించి, రాజ్యతంత్రము నడపుచుండెను.

సదాశివరాయలు హఠాత్తుగా మరణింపఁగా తిరుమలరాయలే రాజ్యాధిపత్యమును వహించి పెనుగొండ రాజధానిగా విజయనగరరాజ్యమును పాలించుచుండెను.

ఇట్లు రాజులును, వారితోఁ బాటు రాజధానులును మాఱినవి. ఐనను హృదయములలో మాత్రము ప్రాంతద్వేషములు ప్రజ్వలింపకపోలేదు.

సదాశివరాయలు బలహీనుఁడనియు, పిఱికివాఁడనియు, తిరుమలరాయలు పరాక్రమశాలియు, ధైర్యసాహసోపేతుఁడనియు, అతఁడెప్పటికైనను తమపై పగ తీర్చుకొని తీరుననియు గోల్కొండ నవాబునకుఁ దెలియును. విజయనగరమును కొల్లగొట్టు సందర్భమునఁ గలిగిన కలఁతలచే బిజాపురసుల్తానులకును, తమకును సఖ్యము చెడినదని యాతఁ డెఱుఁగును. నవాబు తన రాజ్యమును సురక్షితముగ నొనర్చుకొనుటకైనను పెనుగొండను, చుట్టు ప్రక్కల నున్న దుర్గములను స్వాధీనము చేసికొనవలసియున్నది. కాని ప్రస్తుతపరిస్థితులలో అది సాధ్యము కాదు. ఏలయన-తిరుమలరాయలు సేనల నపారముగఁ గూర్చుకొనుచుండెను. అతని సామంతు లందఱును సేనలంగూర్చుకొని యుద్ధ సన్నద్ధులై యున్నారు. నవాబునకు పెనుగొండ స్వాధీనము కావలెననిన బహామనీసుల్తానుతో ఏ విధముగ నైనను చెలిమి చేసికొనక తప్పదు. అందుల కాతఁడు తన ప్రధానామాత్యుఁడగు మీర్జుమ్లాతోఁ గూడ నాలోచించెను.

'బాబయ్య ఉర్సు' సంఘటనలు అతని యాలో చనలకు సహాకరించెను. ఆ యుత్సవసందర్భమున మహమ్మదీయ యాత్రికులు పెక్కుమంది హింసింపఁబడి, అవమానింపఁబడిరనియు, తిరుమలరాయలు బలాఢ్యులగు మహమ్మదీయ ప్రభువులను లెక్కచేయకుండుటయే దీనికిఁ గారణమనియు నొక యారోపణ. అబ్దుల్లా పుత్రికాసహితముగ్గ పెనుగొండయం దుండుట చారులమూలమున నతనికిఁ దెలియును. దాని నాధారముగాఁ గొని 'ఒక యుత్తమ మహమ్మదీయ కుటుంబమును రాయలు నిర్బంధమున నుంచె' ననునది రెండవ యారోపణ

గోల్కొండ నవాబు సుల్తానుతో బంధుత్వము నెఱపి, తన్మూలమున దండయాత్రలో ఆతనిసాయము పొందనెంచెను కుతుబ్ షా ప్రభువు, బిజాపూరు సుల్తానగు రెండవ ఆదిల్ షా ప్రభువునకుఁ దన సోదరి నొసంగి వివాహాము కావింపఁదలఁచెను ఈ యంశములన్నియు ముఖాముఖిగ మాటలాడుటకు గోల్కొండ ముఖ్యమంత్రి యగు మీర్జుమ్లాయే బయలుదేరెను.

మీర్జుమ్లాగారి రాయబారము ఫలించెను. బిజాపురసుల్తాను అతనిని మిగుల గౌరవించెను తమ రెండు రాజ్యములకును గల మైత్రి ఎడతెగక కొనసాగుచున్న

దనియు, ఎట్టి సంఘటనలును దానికి విచ్ఛిత్తిఁ గలిగింప నేఱవనియు, హిందూరాజ్యము విజృంభింపకుండ దాని నణఁచి వేయుటయే తమకును ప్రధానలక్ష్యమనియు నతఁడు పలికెను. గోల్కొండప్రభువుతోడి బంధుత్వము సు మనసారం అంగీకరించెను.

తాము తిరుమలరాయలకుఁ దెలియకుండ పెనుగొండను రెండు ప్రక్కలనుండి ముట్టడించుట మేలని, అది రెుుక్కమాఱుగా జరుగవలెననియు నిశ్చయింపఁబడెను. సుల్తాను వివాహమును ముగించుకొని గోల్కొండనుండి మఱలివచ్చుచు దక్షిణభాగమునుండియు, గోల్కొండ ప్రభువుత్తరమునుండియు నొక్కసారిగా తిరుమలరాయల పైఁ బడుట కుభయులు నొక దినమును నిర్ణయించుకొనిరి.

---

## ౧౦

'బాబయ్య ఉర్సు' జరిగిపోయి పదునైదు దినములైనది. ఈలోగా పెక్కు మార్పులు జరిగినవి!

సదాశివదేవరాయల మరణమువలని దుఃఖ మంతఃపురమున క్రమక్రమముగ ఉపశమిల్లినది. షతిమా యారోగ్యము చాలవఱకును చక్కఁబడినది. మఱి పదునైదు దినములు కడచినపిదప ఆమె గోల్కొండకు ప్రయాణము చేయవచ్చునని వైద్యులు తెలిపిరి. అబ్దుల్లాకు పూర్తిగ నయమయ్యెను. అపుడపుడు తండ్రి, కుమార్తెలు అంతిపురపు పూలతోఁటలో కలిసికొనుచుండిరి. అబ్దుల్లాకు ప్రతాపరాయలతోను, సౌదామినీ చంపావతులతోను బాగుగా పరిచయ మేర్పడెను. వారందఱు నించుమించుగ ఒక కుటుంబములోనివారివలెనే ప్రవర్తింపసాగిరి.

తిరుమలరాయల పరిపాలనము జను లందఱికిని తృప్తికరమై యుండెను. ఆతని రాజ్యమునఁ గల మహాత్మ్రదీయులు నాతనికిఁ జేయెత్తి మ్రొక్కుచుండిరి. ఆ ప్రభుని పాలనము పక్షపాతము లేనిది.

ఇంకను సూర్యుఁ డస్తమింప లేదు. ఉద్యానవనమున ఫతిమాయును, సౌదామినీ చంపావతులు నొక వృక్షము క్రిందఁ గూరుచుండిరి

సౌదా—సోదరి! బారెఁడు ప్రొద్దుండఁగనే మీ జనకుఁడు రావలసినదే! ఏలనో యింతవఱకును రాలేదు. రా వీలు కలిగినదో, లేదో!

చంపా.—పాపము! సౌదామిని కాతనియెడ ఎంత ప్రేమ! ఆయనతోఁబాటు అయ్యగారును వత్తురను నమ్మకమే కదా దీనికిఁ గారణము?

సౌదా—నీ వెట్లనుకొన్నను సరియే! నీ నోటికిఁ దాళము వేయువా రెవరున్నారు?

ఫతి—చంపా! ఆమె కెందుకే యెకసక్కెములు కెత్తించెదవు? నీకు నట్టి వీరుఁడు లభించిన యెడల యెట్లుందువో ఆలోచింపుము

చంపా—ఓహో! అదియా సంగతి? అందులకే గోల్కొండకుఁ బోవుట కంత తొందరపడుట! ఇప్పుడు బాగుగా బోధపడినది లెమ్మా

ఫతి—నీ హాస్యములు కట్టఁబెట్టవమ్మా! అదిగో! నాన్నగారు వచ్చుచున్నారు!

ఇంతలో అబ్దుల్లాను దీసికొని ప్రతాపుఁడు వచ్చెను వారింజూచి, ముగ్గురును లేచి నమస్కరించిరి పిదప నంద

అును గూర్చుండిరి. సౌదామిని ఫతిమా వెనకప్రక్కగా నాసీన యయ్యెను

ప్రతా—(ఫతిమావైపు దృష్టి సారించి) మీా యారోగ్యము కుదిరినట్లే కదా!

ఫతిమా ఔనన్నట్లు తల యూచెను.

చంపా—(సౌదామినితో) 'నీ కాలినొప్పి కుదిరినదా' యని అడుగుచున్నారమ్మా! సమాధానముం జెప్పవేమి?

సౌదామిని చంపావతివైపు కొఱకొఱ చూచెను అందఱు మందహాస మొనర్చిరి.

ప్రతా—మఱల యుద్ధము తప్పనిసరి యైనట్లు తోఁచుచున్నది. ఈలోగా మీారు గోలుకొండ వెళ్లుటయే మేలని తోఁచుటచే ఇట్లు ప్రశ్నించితిని. మఱి యెందుల కును గాదు

చంపా—మీా రడుగుట యెంతయు మేలే యైనది ఎప్పుడు అనుమతి లభించునా, ఎప్పు డూరికి పోదునా యని యీామెయు తహతహపడుచున్నది. నా మాట వాస్తవమే కదా ఫతిమా?

ఫతి—నీకు నమస్కరింతును, ఊరుకోవమ్మా! మఱల ఇంతలోనే యుద్ధమనుటచే నా గుండెలలో ఱాయి పడినట్లున్నది

అబ్బు—అనుకోనకుండ ఈ యుపద్రవము కల్గుటకుఁ గారణ మేమున్నది ?

ప్రతా—ఇది మేము అనుకొన్నదే! సుల్తాను, గోల్కొండ నవాబు విజయనగరమునుండి మఱలి పోవునపుడు ఎట్టి యొడంబడికయును జరుగలేదు. కావున వారెప్పుడైనను పెనుగొండపైకి రావలసినవారే కదా! అంతియే కాదు. గోల్కొండలో మురారిరావు విప్లవమును లేవనెత్తిన కారణమున గోల్కొండలో హిందువులపై నమ్మకము చెడినది ద్వేషము ప్రబలినది తండ్రి మరణమునకు మురారిరావే ముఖ్యకారణమని మహమ్మద్ కులీ కుతుబ్ షాకు విపరీతపుఁ గోపము కలిగెను కావున అతఁడు గద్దె నెక్కఁగానే మీర్జుమ్లా యను యువకునిఁ బ్రధానమాత్యు నొనర్చి హిందూరాజ్యములపై దాడి వెడలుటకుఁ దగిన యదను కనిపెట్టుకొని యున్నాఁడఁట !

అబ్బు—నవాబు బిజాపురపు సుల్తానుకు తన సోదరి నిచ్చి వివాహము చేయుటకు సర్వప్రయత్నములు చేయుచున్నట్లు వదంతి వినవచ్చుచున్నదే! అది అసత్యమా యేమి ?

ప్రతా—నేఁడే వేగరులవలన విశేషము లన్నియును దెలియవచ్చినవి వివాహప్రయత్నముల సాకున యుద్ధప్రయత్నములు విరివిగా సాగుట కిది యొక యెత్తు.

సుల్తాను పెండ్లికి వచ్చినట్లు వచ్చి రెయొక వైపునుండి పెను గొండను ముట్టడించుటకును, నవాబు, తాను రెండవ ప్రక్కనుండి రహస్యముగ ముట్టడి వేయుటకును ఇది ఎంతయు అనుకూలము మీర్జుమ్లా యే యిట్టి ఎత్తులు వేసినట్లు తెలియవచ్చుచున్నది అతఁడు చాల సమర్థుఁడుగ నున్నాఁడు

అబ్దు—అతఁడు బుద్ధిమంతుఁడే! మాకు దగ్గఱి బంధువు పసితనమున నతఁడు మా యింటనే పెరిగెను నాయెడల గొప్ప గౌరవము దైవానుకూల్యమున్నచో, మా ఫతిమా

చంపా—ఓహో! అందులకే యీామె గోల్కొం డకుఁ బోవుటకు మిగుల తత్తఱ పడుచుండుట!

ఫతిమా—కాదు, చంపా! నీకు అచట తగిన వరుని వెదుకవలెననియే అచటికి పోవుటకు నేను తహతహపడుట!

ఈ మాటల కందఱును పక్కున నవ్విరి

ప్రతా—సుల్తాను తనకుఁ జుట్టమైనచో, తన ఆలో చన సాగునని కుతుబ్ షానమ్మకము దీనికై యాతఁ డిచ్చుటి 'బాబయ్య ఉర్సు' సంఘటనలను సాధనములుగా నుపయోగించెను. ఉత్సవములలో రాయల ప్రోత్సాహ మున హిందువులు ముసల్మానులను హింసించిరనియు, హింధువులే సధాశివరాయలను చంపి, ఆ యపరాధమును

మహామ్మదీయులపై (త్రోసిరనియును వదంతులను పుట్టించి రఁట! వింతలలో వింత యేమనఁగా-మిమ్ము, మీ కుమారైను మేము నిర్బంధించితి మనియు, మిమ్ము మిగుల హింసించుచున్నా మనియు, యుద్ధమునఁగాని మీ విడుదల సాధ్యము కాదనియు మీార్జుమ్లా నిశ్చయించెనఁట!

ఫతిమా—మేము గోల్కొండకు వెంటనే పోయినచో ఈ యుపద్రవము తప్పునా?

ప్రతా—అట్లు తలఁచుటకు వీలు లేదు. ఎట్లును యుద్ధము తప్పదు దాని కిదియు నొక చిన్న కారణము! మీరు గోల్కొండకుఁ బోయినను, వివాహసమయమున వచ్చు సైన్యము పెనుగొండపైఁ బడక తప్పదు

అబ్దుల్లా—ఐకమత్యమునకై మనము చేయుప్రయత్నములు ఫలింపవన్నమాట!

ప్రతా—అట్లే తోఁచుచున్నది అయినను ప్రయత్నించినచో కొంత ఫల ముండవచ్చును దీనికై మీ సహాయము ముఖ్యము మీపై మీార్జుమ్లాకు గొప్ప గౌరవమే గదా! మీ మాట నాతఁడు తప్పక గౌరవించుననుకొందును

అబ్దుల్లా—తప్పక గౌరవించును.

ప్రతా—అయినచో ఒక పరిచయ లేఖ కావలెను. అం దెవ్వరి పేరును సూచింపవద్దు. జాబు తెచ్చినవాఁడు

ఆప్తుఁడనియు, మన ప్రయత్నముల కన్ని విధముల నను కూలుఁడనియు, విశ్వాసపాత్రుఁడనియును తెల్పినఁ జాలును.

అబ్దుల్లా— నిరభ్యంతరముగ నిచ్చెదను. అంతే కాదు. మన యాశయము నెఱవేఱుట కెట్టి త్యాగము నైన చేయుటకు నేను, నా పుత్రిక సిద్ధముగా నుందుము.

చంపా—మఱి మీ గోల్కొండప్రయాణముసంగతి యేమి?

అబ్దుల్లా—ఏది యెట్లయినను ఇదేదో తేలువఱకును మే మిచటనే యుందుము. హిందూమహమ్మదీయ సామ రస్యమునకై మీతోఁ గలసి పనిచేయుదుము.

## ౧౧

అబ్దుల్లా యొసఁగిన పరిచయపత్రము బాగుగ పని చేసినది.

ప్రతాపరాయ లా పత్రమును తన కత్యంతాప్తుఁడును, విశ్వాసపాత్రుఁడు నగు హుస్సేనున కొసఁగి కార్యము సాధింప గోల్కొండకుఁ బంపెను. హుస్సేను మీర్జుమ్లాను సందర్శించి, తన చతురసంభాషణలచే నాతనిని వశమొనర్చు కొనెను.

తాను పెనుగొండ నివాసిననియు, అచటి మహమ్మదీయులు తిరుమలరాయల పతనమునకుఁ దగు యత్నము లొనర్చుచున్నారనియు, బాబయ్య ఉర్సులోని సంఘటనలకు రాయలే కారణ మనియు, అబ్దుల్లాయు, నతని పుత్రికయు గౌరవముగఁ జూడఁబడుచున్నను, మీర్జుమ్లాకు బంధువు లైనందున నిర్బంధమున నున్నారనియు, రాయల సైనికబలము స్వల్పమనియు నిట్టి వేవేవో చెప్పి హుస్సేనాతని విశ్వాసమును జూఱఁగొనెను. భావి కార్యక్రమమునుగూర్చి తనకుఁ దోఁచిన సలహాల నీయసాగెను. అయ్యవి మీర్జుమ్లా హృదయము నెంతయు నాకర్షించినవి.

మీర్జుమ్లా గొప్ప రాజకీయవేత్త. అతనికి హుస్సేను పయి నమ్మకము కుదిరినను అతని మాటల నూఁకొట్టి

చుండునే కాని, తా నేమి చేయవలసినదియు నితరులకుఁ దెలియకుండఁగనే యతఁడు కార్యములను నెఱవేర్చును. అతఁడు హుస్సేనును ప్రశ్నించి, ఆ యా విషయములను గనుఁగొనుచు, తా నేమి చేయఁదలఁచినదియు నేకాంత ముగ నాలోచించు చుండును. పనులు నెఱవేఱువఱకు నేమి జరుగు నదియు తన ప్రభువునకును తెలియకుండును. అతఁడు ప్రధాన రాజకీయోద్యోగులతో నేమి మాట లాడునదియును ఎవ్వరికిని దెలియదు. అట్టిగొుడ హుస్సేను దూరముగ నుండును. కాని యాతఁ డెట్లో విషయము లను గ్రహింపఁ గలుగు చుండెను.

యుద్ధప్రయత్నముల సంగతియే ఎవ్వరికిని దెలి యదు. వివాహప్రయత్నములే విరివిగ కొనసాగుచుండెను. మహమ్మదీయప్రభువులకే కాక హిందూరాజులకును వివా హార్థము ఆహ్వానములు పంపఁబడెను. తిరుమలరాయుల కాహ్వానము ముందుగనే అందెను. కాని, వివాహము నకుఁ జాలవ్యవధి యున్న దనఁగనే సైన్యములతోఁ గూడ బయలుదేరి పెనుగొండ కొకవైపు ముట్టడింపవలెననియు, తాను నా సమయమునకే యచటికి వచ్చి కలిసికొందు ననియు, ఆ దుర్గమును జయించిన పిదప వివాహము జరిగిన మేలనియు, ఆ దుర్గమును తాను సోదరి కరణముగా నీయ నున్నా ననియు కుతుబ్‌షా వ్రాయించినట్లు

మీర్జుమ్లా లేఖను వ్రాయించి, దానిపై తన ముద్ర వేసి, అత్యంతవిశ్వాస పాత్రుఁడగు రహీమున కా జాబిచ్చి వేవేగము బిజాపురమున కేఁగవలెనని యానతి యిచ్చెను. ఈ సంగతి హుస్సేను కనిపెట్టెను

రహీము మీర్జుమ్లా భవనమునందే ఒకమూల నున్న గదిలో నివసించు చుండెను హుస్సేను బసచేసిన గదియు నా ప్రక్కనే యుండెను వీరిరువురికిని మంచి పరిచయము. హుస్సేను రహీముగదికిఁ బోవుసరి కాతఁడు స్నానము చేయుచు, క్షణకాలము కూర్చుండఁగోరెను ఆ గదిలోని చిలుకకొయ్యకుఁ దగిలింపఁబడిన అంగరఖాపైకి హుస్సేనుదృష్టి పోయెను దానిలోపలి జేబును పరీక్షింపఁగా అందు ముద్ర వేసి భద్రపరుపఁబడిన జాబేదో కానవచ్చెను హుస్సేను దానిం దీసికొని, అట్టిదే యగు వేఱొక జా బందు ఉంచి, రహీముకొఱ కెదురుచూచుచుండెను ఇంతలో రహీము వచ్చి తా నొక తొందరపనివలన బిజాపురమునకుఁ బోవుచున్నట్లును, వారము దినములలోఁ దిరిగి వచ్చుచున్నట్లును, అంతవఱకును తన గదిని భద్రముగాఁ జూడవలసి నట్లును చెప్పెను.

హుస్సేను—ఓహో! చాల దూరమునకుఁ బ్రయాణము చేయుచున్నావే! ఏదో రహస్యకార్యమునుగూర్చి సుల్తాను వారివద్దకుఁ బోవుచున్నట్లున్నావు!

రహీం—ప్రభువువారి పని తప్ప అంతదూరము పోవుటకు మన కేమి పని యున్నది ? సుల్తానువారి వివాహ మును గూర్చి ఏవో విషయములను వివరించుచు మహా మంత్రిగారు జాబిచ్చినారు.

హుస్సేను—వివాహము నిశ్చయమైనట్లే గదా ! ఎప్పుడు జరుపఁ దలఁచిరి.

రహీం—మహామంత్రి తలఁచుటయును, నిశ్చయము కాకుండుటయునా ? బహుశః నెల దినములలో జరుగు నని అనుకొనుచున్నారు.

హుస్సేను—శుభవార్త తీసికొని పోవుచున్న నీకు గొప్ప బహుమానము లభింపవచ్చును.

ఇది విని రహీము చిఱునవ్వు నవ్వుకొనెను.

---

# ౧౨

గోల్కొండ నవాబు, బహమనీ సుల్తానును పెనుగొం
డను ముట్టడింపఁగలరను సంగతి ముందే తిరుమల
రాయలకుఁ దెలియును. ఈవిషయము సామంతులకును
తెలుపఁబడెను. అందఱును తమ తమ సైన్యములను జతఁ
గూర్చుకొని మాఱుత్రోవల రహస్యముగఁ బెనుగొండకుఁ
జుట్టుప్రక్కలఁ గల చిన్న చిన్న దుర్గముల నాశ్రయించిరి.

పెనుగొండ సమీపమునఁ జిన్న చిన్న కొండ లనేక
ములు గలవు. ఒక్కొక్క కొండయు స్వాభావికముగ
నొక దుర్గమువలె నుండును. అం దచ్చటచ్చట కొన్ని
రహస్యమందిరము లున్నవి. ఆ మందిరములలో ఎంత
కాలమైనను శత్రువులకుఁ గానరాకుండ కాలము గడప
వచ్చును. గుత్తి, గండికోట, సిద్ధవటము మున్నగు చోట్ల
నుండి సేన లసంఖ్యాకములుగ వచ్చి పయి గిరిదుర్గ
ములలో విడిసినవి. యుద్ధమే తటస్థమైనచో, శత్రువుల
కెఱుకరాకుండ పయిఁ బడుట కవి సిద్ధముగ నున్నవి.

తాను బిజాపురమునకు బంపిన వార్త ననుసరించి
కుతుబ్‌షా కొలఁది సేనలతో మాత్రము పెనుగొండకుఁ
గొలఁదిమైళ్ల దూరమున విడిసి యుండెను. తా నచటికి

వచ్చునరికి బిజాపురసుల్తాను సేనలతో వచ్చి యుండుననియతఁడు తలఁచెను. రెండు, మూఁడు దినములు ఎదురుచూచెను. అప్పటికి పెండ్లికయి సుల్తాను కొలఁది సేనలతో తరలి వచ్చుచున్నట్లు తెలిసెను

మీర్జుమ్లా నిలువున నీరయ్యెను కుతుబ్ షా చాల కలఁతపడెను. ఏదియో మోసము జరిగెననియు, తమ లేఖ సుల్తానున కంది యుండదనియు వారు నిశ్చయించి, మఱికొంత సైన్యమును పంపవలెనని రాజధానికి వర్తమానమంపిరి.

ముసల్మాను సేనలు శత్రుపక్షమునకుఁ దమ యత్నములు తెలిసి యుండవనియు, అందులకే వారెట్టి ప్రయత్నములు చేయక యుపేక్షించి రనియుఁ దలంచిరి

పెనుగొండదుర్గమున కెప్పుడైనను శత్రువులవలని భయ మున్నదనియు, దాని నాక్రమించినచో, ఆ పిదప దుర్గమునుండి తప్పించుకొనుట కష్టమనియు నెంచి, రాజ బంధువులును, అంతఃపురములోనివారును ముందే వేఱొక చిన్న దుర్గము నాశ్రయించిరి ఆఱు నెలలపాటైన అందు సురక్షితముగ నుండుటకుఁ దగిన సౌకర్యము లున్నవి. అయ్యది కొండల నడుమ నెత్తైన ప్రదేశమున నుండుటచే నందలివా రితరులకు కానరారు , అందలివారు మాత్రము

చుట్టుప్రక్కల పది క్రోశములవఱకును జరుగు వింతలను, విశేషములను చూడఁగల్గుదురు

ఒకనాఁడు సౌదామినియు, ఫతిమాయును, చంపావతియు నా దుర్గగోపురమున నిలువఁబడి చుట్టుప్రక్కల గమనించుచుండిరి చాల దూరమున పడమటివైపునుండి వచ్చు గొప్ప సేనాసమూహము వారికంటఁబడెను. అది సుల్తాను సైన్యమేమో యని ఫతిమా దిగులుపడెను.

సౌదా—కాదు సుల్తానుసైన్యమంత పెద్దది కాదు అతఁడు వివాహప్రయత్నమున వచ్చుచున్నట్లు మాత్రము తెలియవచ్చినదఁట! ఇది బహుశః మనవారి సేనయై యుండవచ్చును సామంతప్రభువు లందఱును యుద్ధసన్నద్ధులయి రావలెనని రాయలవారాజ్ఞాపత్రములు పంపిరఁట !

ఇట్లను చుండఁగనే ఆ సైన్యము ఇఱుకుదారులలోఁ బడి మాయమయ్యెను

చంపా—నీవన్నది నిజమే! అది సామంతుల సైన్యమే! బహుశః మైసూరుసేనయై యుండవలెను వారు మనవారగుటఁబట్టియే కొండలలో గుప్తమార్గములంబట్టి ప్రవేశించుట యెఱుఁగుటవలన ఎచ్చటనో దాఁగియుండుటకుఁ బోయిరి , పాపము ! శత్రువీరుల కీ మార్గ

ముల సంగతి తెలియదు! మన వారు తగినప్రయత్నము లలో లేరని మే వా రనుకొనుచున్నారు!

ఫతిమా—ఓహో! తెలిసినది! మనవా రిట్లు పొంచియుండి నవాబుసేనలకు గోల్కొండనుండి వచ్చు నాహార పదార్థములను పట్టుకొని, యుద్ధమునకుఁ బూర్వమే వారి కలజడిని కల్గించుచున్నారు! ఇది యెంతయు చక్కని పద్ధతి!

చంపా—మన ప్రభాపుఁడు నేఁటి యుదయమున నొకవార్త తెచ్చినాఁడు నవాబుసాయమునకై గోల్కొండ నుండి మఱికొంత సైన్యము రానున్నదఁట! దానిని మార్గమధ్యముననే నిరోధించుటకు గుప్తిసైన్యములు సిద్ధముగా నున్నవఁట! ఈ విధముగా క్రొత్తసేనలకు సామంత ప్రభువులు మార్గమునందే నిరోధించినచో యుద్ధము తప్పి పోవచ్చును ఒకవేళ యుద్ధము జరిగినను, శత్రువులకుఁ బరాజయము ముమ్మాటికి నిశ్చయము

సౌదా—ఇంకను కొలఁది దినములు జరిగినఁగాని మన మేమియుఁ జెప్పఁజాలము ఇటు గోల్కొండనుండియు, అటు బిజాపురమునుండియు సేనలు వచ్చినయెడల వానిని ప్రతిఘటించి నిలుచుట సామంతసేనలకు సాధ్యముకాని పని! అట్టి పరిస్థితు లేర్పడినచో నడుమ నున్న మన స్థితి అఘోమయ మగును!

ఫతిమా—అట్లు జరుగుటకు ముందే మనము సంధి ప్రయత్నములను చేయవలసి యుండును. ఈ విషయమున ప్రతాపరాయలవారు తగు జాగ్రత వహించుచున్నారని మా తండ్రి తెలిపెను. కుతుబ్‌షా ప్రధానమంత్రిని చూచుటకు మా నాయనయు వెళ్లనున్నాఁడు.

చంపా—మీ తండ్రితోఁబాటు నీవును వెళ్లిన యెడల కార్యము సఫలమగునని నా తలంపు.

ఇట్లనుచు చంపావతి చిఱునవ్వు నవ్వెను

సౌదా—అవసరమైనచో తప్పక వెళ్లఁగలదు ఎప్పటికైనను ఫతిమా మీర్జుమ్లాను చేరవలసినదే !

ఫతిమా—మీ హాస్యముల కేమి గాని, సమయము వచ్చినపుడు నవాబు కుతుబ్‌షాతోఁగూడ వాదించుటకు ఫతిమా ఎంతమాత్రము జంకదని యనుకొనుఁడు

వీ రి ట్లనుకొనుచుండఁగనే ప్రతాపరాయ లచట ప్రత్యక్షమయ్యెను

ప్రతా—ఇప్పుడు మన ప్రయత్నములు సఫలములగునట్లు తోఁచుచున్నది.

చంపా—ఎట్లు ?

ప్రతా—బిజాపురపు సుల్తాను కేవలము వివాహాయత్నముమీఁదనే కాలఁది సైన్యములతో వచ్చుట

యొటింగి మీర్జుమ్లామంత్రి మటికొంత సైన్యమునకు గోల్కొండకు వర్తమానము పంపెను.

చంపా—సుల్తాను పెద్ద సైన్యముతో రాకుండు టకుఁ గారణమేమి? అతనికి యుద్ధమనిన వైముఖ్యము కలిగెనా యేమి?

ప్రతా—దీనికి మన మబ్దుల్లాగారిని ప్రశంసింప వలెను.

ఆ మాట తన కర్థము కాలేదను నభిప్రాయమున ఫతిమా అతనివంక చూచెను

ప్రతా—ఆయన యొసఁగిన పరిచయపుటుత్తరము బాగుగ పనిచేసినది దానిని తీసికొని హుస్సేను గోలు కొండకుఁ బోయి మీర్జుమ్లా పరిచయము సంపాదించెను జాబులను తాఱుమాఱు చేసి ఆతఁడే సుల్తాను సేనలతో రాకుండునట్లు చేసెను హుస్సేనా విధముగం జేయనిచో నీపాటికి సుల్తాను సేనలు పెనుగొండదుర్గము నాక్రమించియే యుండును

చంపా—ఇఁకమీఁద మాత్రము సుల్తాను వార్తా హారులఁ బంపి సేనలను రప్పింప వీలుపడదా?

ప్రతా—వీలుపడకేమి? అయినను, ఆ సైన్యముల నెదిరించుటకు మనపక్షపు సైన్యములు కొన్ని సిద్ధముగనే

యున్నవి. గోల్కొండ సేనలవిషయమునను ఇట్టి యేర్పాటే చేయఁబడెను. శత్రువులు విజృంభించినయెడల గిరిదుర్గములలోను, కొండలోయలలోను దాఁగియున్న మన వారు పైఁబడఁ గలరు తమకు రెండు ప్రక్కలను శత్రుసేన లెదుర్కొనునడుపు గోల్కొండవారు సంధికి వచ్చుటకు వీలగును మీర్జుమ్లా నబ్దుల్లా కలిసికొని మాటలాడుటకుఁ దగిన యత్నము జరుగనున్నది

చంపా—తండ్రితోఁ బుత్రికయు వెళ్లవలసి యుండునా ?

ప్రతా—ఉండవచ్చును 'బాబయ్య ఉర్సు' సంఘటనలు ఫతిమా చెప్పిననే మీర్జుమ్లాకు బాగుగ బోధపడఁగలవు

చంపా—అట్లయినచో వస్తువాహనములను, చీరల నిచ్చి యిప్పుడే సాగె పంపవలెనా ?

ఈ మాట కందఱును నవ్విరి

ప్రతా—అది యామె యిష్టము ప్రస్తుతస్థితిగతులనుబట్టి యామె యచటికి రహస్యముగ వెళ్లుటయే మేలని నాకుఁ దోఁచుచున్నది

ఫతిమా—(చంపావతితో) నీ వనినట్లు నేఁ బోవలసి యున్నచో నన్ను సాగనంపుటకు నీవును రావలసి యుండును గదా !

చంపా—పులి యున్న గుహలోనికి మేఁక పిల్ల ఎట్లు పోఁగలదు?

ఫలిమా—ఎంత అమాయికవే! నోటిలో వ్రేలు పెట్టినఁ గఱచుటకుఁగూడ చేతకాదు, నీకు!

చంపా—నీ కన్నియుఁ జేతనగునమ్మా! (నవ్వుచు) ప్రస్తుతము నీవు పురుషవేషమునఁ బోవలసి యుండునని ప్రతాపుని అభిప్రాయము సుమా! నీ కదియు చేతనగు నన్నమాట!

ప్రతా—కార్యనిర్వహణముపట్ల యువతులును పౌరుషము చూపుట స్వభావమే కదా!

---

మీర్జుమ్లా తన పటకుటీరమునఁ గూరుచుండి పెనుగొండ నెట్లు ముట్టడించుటయా యని ఆలోచించు చుండెను శత్రుసేనలు తమ కంటెఁ ఒడకున్నను, ఆహారవస్తువులు తమ కందకుండుటవలన వానిని శత్రువులు వశపఱచు కొనుచున్న ట్లాతఁడు నిశ్చయించెను

చారు—ప్రభూ ! సుల్తానుప్రభువుల యాదేశ ముపై బిజాపురమునుండి పదివేల సైన్యము వచ్చు చున్నది తమయాజ్ఞ ననుసరించి పదివేల సైన్యము గోల్కొండనుండి వచ్చుచున్నది కాని గుత్తిదుర్గమునుండి కొంత సైన్యము బయలుదేరి మన సేనను ప్రతిఘటింప నున్నట్లు తెలియుచున్నది

మీర్జుమా—మన యాహారవస్తువుల నడ్డుకొను చున్నవారును వారే కాఁబోలును ?

చారు—వారుకారు ప్రభూ ! మన బండ్లను దగ్గ ఱకు రానిచ్చి, కొండలలోను, లోయలలోను దాఁగి యున్న పెనుగొండ సైనికులే కొల్లగొట్టుచున్నారు శత్రు సేన లెక్క డెక్కడ నున్నదియు, దాని పరిమితి ఎంత యైనదియును తెలియకున్నది ఈ ప్రదేశములు మనవారికి

పరిచితములు కానందున ఎటు బయలుదేరిన ఏమగునో యని కలంతపడుచున్నారు.

ఇట్లు చెప్పి, యా చారుండు వెడలిపోయెను.

ఇంతలో ద్వారపాలకుండు వచ్చి 'ఎవరో ఒక వృద్ధుండును, ఒక యువకుండును దర్శనార్థము వచ్చి' రని చెప్పి, అమాత్యుని యనుమతితో వారలను లోనం బ్రవేశ పెట్టెను.

మీర్జుమ్లా యా వృద్ధునిం గాంచి భక్తివినయ ములతో సలాముచేసెను అతనిరాక మహామంత్రి కాశ్చ ర్యమును కలిగించెను.

అందఱును రత్నకంబళిపై గూర్చుండిరి.

మీర్జుమ్లా—మీదర్శనమున ధన్యుండ నైతిని మిమ్ము శత్రువులబారినుండి తప్పించుట యెట్లనునదియే మాకు సమస్యయైనది. మీరు తప్పించుకొనివచ్చుట చాల సంతసము కూర్చినది మీపుత్రిక యెచ్చట? ఈ పిల్లవాం డెవరు?

ఆ మాటలు విని పురుషవేషమున నున్న ఫతిమా తల వంచుకొనెను ఆగంతుకుండగు అబ్దుల్లా మందహాస మొనర్చెను.

మీర్జుమ్లా సంగతిని గ్రహించెను. శత్రువులనుండి తప్పించుకొనుటకు ఫతిమా పురుషవేషము వేయవలసి వచ్చెనని యాతండనుకొనెను.

మీర్జుమ్లా—మీ వంశగౌరవమునైనను తలంపక పెనుగొండలో మిమ్ము హింసించి, చెఱయందుంచినందులకు తిరుమలరాయలకుఁ దగిన ప్రాయశ్చిత్తము కావలసి యున్నది.

అబ్దుల్లా—ఆ విషయమును గూర్చి మాటలాడుటకే ఇప్పుడు రావలసి వచ్చినది.

మీర్జుమ్లా—చాల సంతోషము ! మీ రేమి చెప్పిన నట్లు చేయుటకు సంసిద్ధుఁడను

అబ్దుల్లా—అట్టి వాగ్దానమే ముఖ్యముగా నాకుఁ గావలసినది నాయనా ! నీవు ఉత్తముఁడవు నాయెడల నీకు గౌరవము, విశ్వాసము ఎక్కువ. అందువల్లనే యిట్లు వాగ్దాన మొనర్చితివి ! పెనుగొండ నెప్పుడు ముట్టడింపఁ దలఁచితిరి ?

మీర్జుమ్లా—రేపటి యుదయమున. దానికిఁ దగిన ప్రయత్నము లన్నియు జరిగినవి.

అబ్దుల్లా—మీరు ముట్టడించి, దానిని స్వాధీనము చేసికొన్నను తగిన ప్రయోజన ముండదని నా యభిప్రాయము ఏలయన ఈపాటికే రాజకుటుంబము, విలువైన వస్తువులును, సొత్తును, సమీపమున రహస్యముగ నున్న గిరిదుర్గములకుఁ బంపఁబడినట్లు తెలిసినది.

మీర్జుమ్లా—గోల్కొండనుండియు, బీజాపురము నుండియుఁ గావలసినంత సైన్యము రావచ్చును కాని, ఎట్టి మాఱుమూలల నెవ్వరు దాఁగియున్నను పట్టుపడక తప్పదు

అబ్దుల్లా—సైన్యము లధికముగ వచ్చుచున్న నేమి ? వాని నెదుర్చుటకు శత్రుసేనయును సిద్ధముగ నున్న వఁట కాదా ?

మీర్జుమ్లా—ఉండిన నుండనిండు. వానిని మన సేన లవలీలగా ఓడింపఁగలవు.

అబ్దుల్లా—కావచ్చును. దానివలనఁ గలుగు ప్రయోజనము జననాశముకన్న వేఱొకటి ఉన్నదని నే ననుకొనను

మీర్జుమ్లా—లేకేమి ? మాకు విజయమే గొప్ప ప్రయోజనము !

అబ్దుల్లా—మీకు విజయము కల్గునని నిశ్చయముగాఁ జెప్పజాలరు. ఒకవేళ కలిగినను అది నామమాత్రపు విజయమే యగును విజయనగరరాజ్య మీవఱకే కొల్లఁగొట్టఁబడినది. ఈ విజయమున ధనము లభింపదు కాన దీనివలనఁ గల్గునది జననష్టముమాత్ర మని నా యాశయము

మీర్జుమ్లా—మీరు మీ పూర్వపుధోరణిలోనే మాటలాడుచున్నారు అహింసాపద్ధతి కిది యదను కాదు. శత్రునాశము మనకు శ్రేయోదాయక మని మా తలంపు.

అబ్దుల్లా—యుద్ధమువలననే శ్రేయస్సు కలదని తలంచినచో ఇతరులను సంహారించుటయే పరమలక్ష్యమని యర్థ మగును. ఇట్టిదానిని అన్ని మతములును గర్హించును గదా!

మీర్జుమ్లా—యుద్ధములు లేనియెడల రాజ్యములకు సుస్థిరత యె ట్లేర్పడును ?

అబ్దుల్లా—రాజ్యము సుస్థిరమై యుండుటకు యుద్ధము సరియైన సాధనము కాదని నా తలంపు దానికి ప్రజల యభిమానము కారణము ప్రజాభిమానముఁ బడయుటకు ప్రజలను న్యాయముగ పాలింపవలెను. యుద్ధము వలన రాజ్యమునకుఁ గలిగిన స్థిరత కొలఁది కాలము మాత్రమే ! పరాజితుఁడగు విరోధి ఎట్లయినను పగను సాధించుకొనుటకే యత్నించుచుండును. దానివలన ఎప్పుడును యుద్ధభయ మనివార్యమగును. ప్రజలు ప్రభుత్వము నెడ విశ్వాసమును గోల్పోవుదురు.

మీర్జుమ్లా—మీ మాటలనుబట్టి చూచినచో ఆయుధములవలనఁ బనియే లేదు అవి లేనపుడు ప్రభుత్వమునకు ప్రజలు లొంగుటయు, సామంతులు చక్రవర్తు

లకుఁ బన్నులు చెల్లించుటయు, ప్రజలలో శాంతి నెల కొనుటయును గూడ అసంభవములే యగుచున్నవే! ఎక్కువ, తక్కువ భేదము లడుగంటునే? సామ్రాజ్యాధి పతుల గౌరవము మొదలంట నశించునే!

అబ్దుల్లా—దుండగులను శిక్షించుటకును, ప్రజలను రక్షించుటకును, శాంతిని నెలకొల్పుటకును ఆయుధము లును, సేనయు ఆవశ్యకములే! సామంతులుగాని, ఇతరులు గాని మీఁదికి వచ్చినప్పు డాత్మరక్షణ మావశ్యకమే కదా! అట్టిపద్ధతిలో గౌరవమునకు హాని యుండదు, సామ్రాజ్యాధిపతి యధికారమునకు లోప ముండదు వ్యక్తిగతవిద్వేషములనుబట్టి సేనలు జనసామాన్య సంహారమునకు సాధనములగుట తగదు

మీర్జుమ్లా—ఇపుడు తిరుమలరాయలపైకి దండెత్తి వచ్చుట తగదనియేనా మీ తలంపు!

అబ్దుల్లా—ఆ యంశము నీ వాలోచింపఁదగినది! ఇతని సోదరుఁడు రామరాయలు సుల్తానును కన్నకుమా రునికంటె నెక్కుడుగఁ జూచుకొనుచుండెను. అతని మహిషి, తిరుమలాంబయు నట్లే గౌరవించెడిది! రాయలు మనతోను ఎక్కువ సఖ్యము కలిగి యుండెను. ఇయ్యది స్థిరమైనదని యాతఁడు భ్రాంతిపడెను. అందువల్లనే

యాతఁడు తగినయత్నము చేయకుండెను ఇదే సమయ మని కనిపెట్టి మన మేకమై తాళికోటసమరమున ఆ యుదారుని మడియించితిమి. రాజధానిని కొల్లగొట్టితిమి ప్రజలను పరిపాలించుటకుఁ బూనుకొనక, వారి గతికి వారిని విడిచితిమి. ఇదే సమయమని బలవంతులు బల హీనులను పెక్కువిధముల హింసించిరి వారిని అదు పులో నుంచి, యిప్పుడిప్పుడే తిరుమలరాయలు ప్రజలలో శాంతిని, నిర్భీతిని నెలకొనఁజేయుచున్నాఁడు ఇట్టి సమయ మున మఱల దాడి వెడలుట న్యాయమో కాదో ఆలో చించుకొనుము

మీర్జుమ్లా—మీ రుభయపక్షములను సమాన ముగఁ జూడవలయును 'బాబయ్య ఉర్సు' లో మిమ్ము హింసించి చెఱయం దుంచినవారింగూర్చియేనా మీ రిట్లు మాటలాడుచున్నారు ?

అబ్దుల్లా—ఆ సందర్భమున మ మ్మెవ్వరును హింసింప లేదు , ఎవ్వరును నిర్బంధింపను లేదు అక్కడ జరిగిన దొకటి ! లోకమున వ్యాపించిన వదంతి ఇం కొకటి !

మీరుమ్లా—మఱి మీ రిన్నిదినములచట ఏల ఉండవలసి వచ్చినది ?

అబ్దుల్లా—ఉత్సవముల సందర్భమున చిన్న కొట్లాట జరిగిన సంగతి వాస్తవము దానికిఁ గారణ మెవ్వరికిని తెలియదు ఒక పక్షమువా రింకొక పక్షమువారిపై దోషము నారోపింతురు. ఇది సహజముగదా! తర్వాత విజయగర్వమున మనవారే విజృంభించిరి. చిలికి, గాలి వాన యైనది. ఉత్సవములను చూడవచ్చిన ప్రభువు సదాశివరాయలే హత్యచేయఁబడెను! ఆ సమయముననే అమ్మాయికి పెద్ద దెబ్బ తగిలి స్మృతి లేకుండఁ బడిపోయినది. నేనును బాగుగ గాయపడితిని

మీర్జుమ్లా—ఎంత పని జరిగినది?

అబ్దుల్లా—అప్పుడు మాకు సేవచేసినవా రెవరు? సోదరులగు మహమ్మదీయులు కారు! ఒక ప్రభుత్వోద్యోగి నన్ను ప్రభుత్వవైద్యశాలలోఁ జేర్చి తగిన చికిత్స చేయించెను ఎట్టి లోపము రాకుండఁ గాపాడెను. పిదప తనయొద్దనే యుంచుకొని తండ్రికంటె నెక్కువగ గౌరవించుచుండెను ఫతిమా నంతఃపురపరిచారికలు తీసికొని వెళ్లిరి స్త్రీలకుఁ బ్రత్యేకముగ వైద్యశాల లేకుండుట వలనను, మర్యాద గల కుటుంబమునకుఁ జెందిన యీమెను తగురీతిని గౌరవింపవలసి యుండుటను రాజాంతఃపురభవనమున నొకచోట ఈమెకు బస యేర్పఱుపఁబడినది. రాజు

కుటుంబమునకుఁ జెందిన ఒక యుదార యీమెను సోదరి కంటె నెక్కువగఁ బ్రేమించుచున్నది. మొన్నటివఱకును ఈమెకు చికిత్స జరుగుచునే యున్నది. మేమును ఒకటి, రెండు దినములలో రాజధానికి బయలుదేరఁ దలఁచి యున్నాము. ఇంతలో ఈ యుద్ధవార్త!

తండ్రి యిట్లు పల్కుచుండ ఫతిమా తన నొసటిపై నున్న గాయపుమచ్చ కానరాకుండ ముఖము నావలికి త్రిప్పెను. దీనిని మీర్జుమ్లా గమనించెను.

మీర్జుమ్లా—దీనికై మన మందఱము వారికి కృతజ్ఞులమై యుండవలసినదే! కాని యీ యల్లరి జరిగినందులకు బాధ్యులగువారికిఁ దగిన శిక్ష కావలసినదేకదా!

అబ్దుల్లా—శిక్ష తప్పనిసరి యైనచో రాయల హత్యకుఁ గారణమని అనుమానముపై మనవారి నంద ఱిని వారు చెఱయం దుంచవలసినదే! కాని ఆవిధముగ జరుగలేదు దీనికిఁ గారణమును గమనింపవలెను

మీర్జుమ్లా—మనవలని భయమే తప్ప వేఱేమి కారణ ముండును?

అబ్దుల్లా—భయపడి, మనవారిని వారు విడిచిన మాత్రమున మీరు దాడివెడలుట మానిరా యేమి? మీ రెట్లును, ఏదో నెపము కల్పించుకొని యుద్ధమునకు రాక

తప్పరని వారికి మొదటినుండియు అనుమానము కలదు కాన వారు భయపడినను ప్రయోజనము లేదు. కాన వా రెంతమాత్రము భయమున నట్లు చేయలేదని గ్రహింపుము మఱియు యుద్ధమే సంభవించినచో, స్త్రీలు కూడ వెనుదీయరని తెలియుచున్నది ఏమమ్మా ! ఫతిమా ! ఆ విషయము నీకు బాగుగాఁ దెలియు ననుకొందును.

ఫతిమా—(మెల్లగా) అవును అంతఃపురములోని స్త్రీలు సాముగరిడీల నేర్చుచున్నారు. ఆత్మగౌరవమును రక్షించుకొనుట ప్రతిభారతీయయువతికిని పరమధర్మమని వారి నమ్మకము ఈమాఱు యుద్ధము తటస్థించుచో జయమో, చావో తప్పదని అందఱును పట్టుదలతో ఉన్నారు సేనాబలము తక్కువై, అపజయము నిశ్చయమగుచో – పెనుగొండలో నొక్క యువతియు జీవములతోఁ బట్టుపడదు. కొందఱు మతాంతరయువతులును వారి ననుసరింపఁగలరు

ఫతిమా రెండు, మూఁడు బాష్పబిందువులను రాల్చెను

అబ్దుల్లా దీర్ఘముగ నిశ్వసించెను

మీర్జుమ్లా మఱి మాటలాడలేదు అతనితల తిరుగుచున్న ట్లుండెను. అతని కంతయు అగోచరముగ నుండెను.

సేనాధిపతి యాజ్ఞఁగొని, ద్వారపాలకుని మూలమున ముందుగాఁ దన యాగమనము నెఱిఁగించి గోల్కొండ ప్రధానామాత్యుఁడు బిజాపురపు సుల్తాను ఆదిల్‌షాహా పటకుటీరమును ప్రవేశించెను.

పరస్పరాభివందనములు, కుశలప్రశ్నమును నైన పిదప ఉచితాసనములపైఁ గూర్చుండి వారిట్లు సంభాషించిరి.

సుల్తాను—మీరు మా కెదురొక్కలిచ్చుటకు ఇంతదూరమునకు వచ్చుట సంతసము ఇక్కడనే మన ముభయులము ఆఁగినయెడల పెనుగొండవారికి పెక్కు సందేహములు కలుగవచ్చును. మనము గోల్కొండకు బయలుదేరుటయే మేలేమో!

మీర్జుమ్లా—సుల్తాను ప్రభువులు సెలవిచ్చినది బాగుగనే యున్నది. అందులకై మజిలీలలో తగిన యత్నములు జరుగుచున్నవి

సుల్తాను—మఱికొంత సైన్యమును బిజాపురము నుండి రప్పింపవలసినట్లును, మీ రాజధానినుండి కూడ

కొంత సైన్యము వచ్చుచున్నట్లును తెలిసినది ఇది యదార్థ మేనా ?

మీర్జుమ్లా—ప్రభువులకుఁ దెలిసినది వాస్తవమే ! ఇక్కడికి వచ్చినచో యుద్ధము సంభవింపవచ్చు నని యూహించి మీ సైన్యాధ్యక్షున కట్లు తెల్పితిని ప్రస్తుత పరిస్థితులలో యుద్ధమున కవకాశ మున్నట్లు తోఁచదు

సుల్తాను—మీ యూహకుఁ గారణమేమి ?

మీర్జుమ్లా—(నవ్వుచు) తొలుత యుద్ధప్రయత్నమున మేమే వచ్చితిమి "బాబయ్య ఉర్సు" సందర్భమున మనవారిని చాలమందిని రాయలు హింసించినట్లును, అవమానించినట్లును తెలిసినది సామంతరాజులను కూడఁ గట్టుకొని గోల్కొండపైకి రానున్నట్లు చారులు తెల్పిరి కావున రెండు ప్రక్కలనుండియు ఇరువ్వరము ముట్టడించిన పెనుగొండ అవలీల స్వాధీనమగునని తలఁచితిని కాని రాయలు యుద్ధమునకు సిద్ధముగ నున్నట్లే కానరాదు ఇంతకును 'బాబయ్య ఉర్సు' సందర్భమున జరిగిన అల్లరులకు మనవారే కారణమనియు, ఆసమయముననే సదాశివ రాయలు చంపఁబడెననియు, దానికి మనవారే బాధ్యులనియు నిశ్చయముగా నిన్ననే తెలియవచ్చినది అల్లరులలో గాయపడినవారిని హిందువు లెంతో ఆదరించి,

చికిత్స చేసిరంట! యుద్ధసంసిద్ధుఁడు కాని దుర్గాధిపతిపైని నిష్కారణముగ దండెత్తుట యుచితము కాదని నాకు తోఁచినది మా ప్రభువులకీ సంగతి తెలుపఁగా, వారును సమ్మతించిరి మీ యభిప్రాయము నెఱుఁగఁగోరి యిట్లు వచ్చితిని

సుల్తాను—రామరాయ లస్తమించినప్పటినుండియు మాకు యుద్ధమునెడల విముఖత కలిగినది పుత్రవాత్స ల్యముఁ జూపుచున్న యా ప్రభువు నెదిర్చి సేసు గొప్ప పాపమును గడించితినని పశ్చాత్తాపము కలిగినది మనము వారి రాజ్యమును జయించినను, ప్రజలను న్యాయముగఁ బాలించుట మాని, నగరమును కొల్లగొట్టి ప్రజల యవి శ్వాసమునకుఁ బాత్రులమైతిమి ఇరువ్వైడల మఱల కాగ ణము లేకయే యుద్ధమునకుఁ గడంగుట యుత్తమపద్ధతి కాదు మఱియు వివాహమునకయి పోవుచున్న సమయ మున యుద్ధప్రసక్తి శుభకరము కాదు.

మీర్జుమ్లా—అదియే నా సందేహము కూడ ఇఁకమీఁద యుద్ధము సంభవించినచో వారిపక్షమున స్త్రీలుకూడ సిద్ధపడునట్లు నమ్మకమైన వార్త తెలిసినది. ఈ సమయమునను మనకు విజయము లభింపవచ్చును గాని, ఆఁడువారితో యుద్ధమునకు సిద్ధపడితిమను నప

ఖ్యాతి శాశ్వతముగ నుండిపోవును మనవారును కడచిన యుద్ధములో జాలమంది మరణించిరి అది జరిగియు గొలఁదికాలమే యైనది సమరమునెడ సైనికుల కెవ్వరిని ఉత్సాహ మున్నట్లు తోఁచదు శత్రుసేనలు మనకంటి కగ పడకుండ గిరిదుర్గములలో దాఁగి, సమయము నెదురు చూచుచున్నట్లు తెలిసినది ఇది వాస్తవమని నమ్మవచ్చును.

సుల్తాను—పరిస్థితు లిట్లున్నను మీారు యుద్ధమునకు సంకల్పించుటకుఁ బ్రబలకారణము పెనుగొండలోని 'బాబయ్య ఉర్సు' సంఘటనలే అనుకొందును

మీార్జుమ్లా—సుల్తానుప్రభువులు బాగుగ గ్రహించినారు మతమును గూర్చి మాకు పట్టుదల యెక్కువ యగుటయే దీనికిఁ గారణము యథార్థము తెలిసినపిదప మన ప్రయత్నము సరియైనది కాదని అవగతమైనది.

సుల్తాను—మనలోని అంత కలహములకును, తన్మూలమున దేశ మధోగతికి వచ్చుటకు నిట్టి పట్టుదలలే కారణము మనమును, హిందువులును సఖ్యముతో మెలఁగినయెడల దేశమున నలజడి నశించి, అభివృద్ధి యేర్పడుటకు ఎన్నియో అవకాశములు కలవు దయా దాక్షిణ్యములకును, పరోపకారములకును జాతిమతములతో నిమిత్తము లేదు. మా పూర్వపురుషు నుద్ధరించిన యతఁ

డొక హైందవుఁడు! మొన్న మొన్నటివఱకును మీ రాజ్య మునకు ముఖ్యామాత్యులై రాజ్యమును విస్తరింపఁ జేసినవారు హైందవులు! విజయనగరరాజు లన్ని మత ములవారిని సమానముగ నాదరించి పాలించిరి. తుదకు పెనుగొండలోని దేవాలయమును మన కప్పగించిరి కొంత వఱకైనను మనము కృతజ్ఞతఁ జూపవలసి యున్నదికదా!

విార్జుమ్లా—చాల సంతోషము!

సుల్తాను—మా రాజధానినుండి బయలుదేఱిన సేనలను తిరిగి రాజధానికే మఱలించుటకు హుకుములను ఇపుడే జారీచేయఁగలము

---

# ౧౫

తిరుమలరాయ లేకాంతగృహమునఁ గూరుచుండి అమాత్యులతో భావికార్యక్రమముఁగూర్చి యాలోచించుచుండెను. ఆ సమయమునఁ బ్రతాపరాయలు కూడ నచ్చటనే యుండెను.

తిరు—వారము దినములు పైగా నయినది. గోల్కొండ సేనలు మన దుర్గమునకు నాల్గుక్రోశముల దూరమున విడిసి యున్నవి. వేఱొకవైపు సుల్తాను సపరివారముగ విడిసి యున్నాఁడు కాని యెవ్వరు నింతవఱకును దండెత్తి వచ్చు సూచనలు కనఁబడలేదు. దీని యంతరార్థ మేమో బోధపడకున్నది. మనమే వారిపైకి పోవలెనని యభిప్రాయమా?

ముఖ్యమంత్రి—ఇందేదో రహస్యమున్నది. యుద్ధమునకు వచ్చిన నవాబు ఎదురుచూచుట యేల? పెండ్లికిఁ బోవుచున్న సుల్తానిచటనే రెండు దినము లుండుటేల? ఇందలి రహస్యమును గుర్తెఱిఁగిన యతఁ డొక్క ప్రతాపరాయలే యని నా నమ్మకము

ప్రతా—ప్రభువుల కిదివఱలో నొకప్పుడు సూచించి యున్నాను. మన దుర్గముననే కొందఱు శాంతిప్రియు

లోక సంఘముగాఁ గూడి మన దక్షిణదేశమున శాంతి స్థాపనకుఁ బ్రబలప్రయత్నములు చేయుచున్నారు అందు హిందువులే కాక మహమ్మదీయులును, పురుషులే కాక స్త్రీలును సభ్యులుగాఁ జేరి యున్నారు ప్రభుత్వముతో సంప్రతింపకయే వారు తమ ధర్మములను నెఱవేర్చు చున్నారు. యుద్ధము ప్రారంభము కాకుండుటకు వారి ప్రయత్నము కారణమై యుండును.

వేఙ్కటాద్రి—ప్రభుత్వమునకుఁ దెలుపకయే ఇట్టి కార్యములు చేయుచున్న ఆ సంఘముపై తగినచర్య తీసి కొనవలసి యున్నది

ముఖ్య—ప్రభుత్వమునకుఁ దెల్పి, ఆమోదమును పొందినచో - ఎదిరిపక్షమువారికి నమ్మకము కుదురక పోవచ్చును ఇంతకును అది యొక సంఘము కాదు నల్గు రైదుగురు మిత్రులు దీనికి బాధ్యులు.

ప్రతా—ఈ విషయమున గోల్కొండ నివాసియు, ప్రస్తుతము పెనుగొండ వాసియు నగు అబ్దుల్లా అను నతఁడును, అతనిపుత్రికయును ఎక్కువ శ్రమపడుచున్నారు యుద్ధము తప్పినయెడల మనము వారినే అభినందింపవలెను.

ముఖ్య—(చిఱునవ్వు నవ్వుచు) ఆ సంఘపుటి ధ్యక్షుఁడగు ప్రతాపరాయలును, కార్యదర్శిని సౌదామినీ దేవియు ప్రశంసాపాత్రులు కారా?

ఈ సంఘటనకు ప్రతాపుడే కారణమని అచటివా రాతనిని ప్రశంసించిరి

ఇంతలో నొక సేవకుఁడు వచ్చి బిజాపురసుల్తాను వద్దనుండియు, గోల్కొండ నవాబువద్దనుండియు రాయ బారములు తెచ్చి ఇరువురు వ్యక్తులు ప్రభుదర్శనమును కోరుచున్నట్లు తెల్పెను

రాయలువారిని వెంటనే లోనికి రప్పించి, సగౌరవ ముగ ఎదురేఁగి, ఉచితాసనములఁ గూర్చుండఁజేసెను

ఒకఁడు—'ప్రభువర్యా! మా ప్రభువులుగోల్కొండ ప్రభుని సోదరిని వివాహమాడఁబోవుచున్నారు ప్రభువులు జరిగినదానిని మఱచిపోఁగోరుచు, సదా మీ మైత్రిని కాంక్షించుచున్నారు వివాహసమయమునకు ఏలినవారికి రా వీలు కల్గనిచో, ప్రతినిధినైనను పంపి, యాహ్వానమును గౌరవింపఁగోరుచున్నారు' అని సవినయముగఁ దెల్పి ఆహ్వాన పత్రికను సమర్పించెను

తిరు—చాల సంతసము! సుల్తానుగారి మైత్రి సర్వదా మాకు నభిలషణీయము వారి యాహ్వానము తప్పక గౌరవింపఁబడునని మనవిచేయుము

రెండవవాఁడు—విద్యానగరప్రభూ! మా నవాబు ప్రభువులు మీ కాప్తవర్గములోనివారు 'బాబయ్య

ఉర్సు' సంఘటనలవిషయమున పొరపడినందులకు వారు చింతిల్లు చున్నారు. తమ సోదరివివాహమునకు తప్పక విజయము చేయవలెనని ప్రార్థించుచున్నారు ఇంతే కాదు మాకు ముఖ్యమంత్రిగా నున్న మీర్జుమ్లాగారికి మీయధీనమున నున్న ఫతిమాకన్య నొసఁగి వివాహము జరిగింపవలెనని మఱియొక ప్రార్థన.

అని పలుకుచు నతఁడు ఆహ్వానపత్రికను సమర్పించెను

తిరు—మా కమితానందము! మా ప్రతినిధి ప్రతాపరాయలు స్వయముగా వచ్చుననియు, ఫతిమాకన్యావివాహమును స్వయముగా నాతఁడే జరిపించుననియు మీ ప్రభువులతో మనవి చేయుము

పిదప తిరుమలరాయలు వధూవరులకు నల్గురికిని పెండ్లికట్నములను ముందుగనే పంపెను

మఱునాఁడే సుల్తాను, నవాబులు సేనలతో భాగానగరమునకు బయలుదేరిరి

* * *

ప్రయాణసమయమున అబ్దుల్లా తన పుత్రికతోఁ గూడ తిరుమలరాయలవద్ద సెలవుగైకొని సౌదామినీ, చంపావతులను జూడవచ్చెను.

చంపావతి ఫతిమాచెక్కిలిపైఁ గొట్టుచు, 'ఎంత గడుసుదానవమ్మా! యాత్రనెపమున మాయూరు వచ్చి కట్నములతోఁగూడ వెళ్లిపోవుచున్నావు. ఇఁక మే మెందుకు జ్ఞప్తియం గుందుము? మాకంటెను ప్రియతమ మగు వస్తువు లభించినదిగదా!' అనెను.

శారదా—చంపా! నీ వినివఱకు హాస్యమున కనిన మాటయే నిజమైనది. ఫతిమాను వస్తువాహనములతోఁ గూడ సారె పంపవలసి వచ్చినది!

ఫతిమా—లేదమ్మా! కొద్ది దినములలో ఈ ముచ్చట నీకును దీరునుగద! అప్పుడు రెండింతల కట్న ములు నీకు ముట్టఁజెప్పుదును లెమ్ము.

చంపా—ఆఁడుపడుచుల కామాత్రపు త్యాగ ముండుట విశేషమే!

శారదా—ఈయక పోయినను పోనిమ్ము. మనలఁ జూచుటకైన నెపుడేని వచ్చినఁ జాలును.

చంపా—ఇఁక నీమె మన చెలి కాదు; నవాబు గారి మహామంత్రియొక్క దేవి–ఫతిమా బేగం సాహే బాగారు! అంతఃపురమునుండి ఒక్క యడుగైన నీవలఁ బెట్ట వీలుకాదు.

ఫతిమా—మీ యిష్టమువచ్చిన ట్లనుఁడు; సమయము వచ్చినపుడు నా కెట్టి స్వాతంత్ర్య మున్నదియుఁ దెలిసికొనకపోరు.

*　　　　*　　　　*

మఱి కొలఁది దినములలో సౌదామినీ ప్రతాపులకు పెనుగొండలో మహావైభవమున వివాహము జరిగెనని పాఠకు లూహింపకపోరు. ఆ వివాహమునకు ఫతిమా వచ్చెనో, లేదో పెండ్లిసందడిలో కొట్టుమిట్టాడుచున్న వారి కెట్లు జ్ఞప్తియుండును ?

